చర్చావేదిక

## అకాడమీల రద్దు కళలకు గ్రహణమా?

అచ్చులో (1/4 క్రౌన్ సైజు) ఒక పేజీలో వచ్చేవిధముగా మీ అభిప్రాయములను ఆహ్వానిస్తున్నాము.

— సం.

ఆగస్టు - 1985

సంపుటి 1

సంచిక 8

# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు-కొమరగిరి క్రిష్ణమోహనరావు

మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-51 రామానాయుడుపేట

మచిలీపట్నం-521 001

ఫోన్ : 2818

చందా వివరాలు

విడిప్రతి : రు. 2-50

సంవత్సర చందా : రు. 30-00

జీవిత సభ్యత్వం : రు. 500-00

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at

SPANDANA PRINTERS

MACHILIPATNAM

on behalf of

Triveni Publishers Pvt. Ltd.

Machilipatnam

## విషయసూచిక

# సంపాదకీయం

## రిజర్వేషన్ల రగడ

రిజర్వేషన్ల విధానంపై జాతీయస్థాయిలో ఏకాభిప్రాయం సాధించాలని రాష్ట్రపతి శ్రీ జైల్‌సింగ్, ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ వాంఛిస్తున్నట్లుగా ఇటీవల వారు చేసిన ప్రసంగాలద్వారా మనకు ద్యోతక మవుతున్నది. ప్రతిపక్షాల నాయకులు సహితం ఇదే విధమైన అభిప్రాయాలను వెలిబుచ్చుతున్నారు. అయితే ఏ రాజకీయ నాయకుడు ఈ విషయంలో తన అభిప్రాయాలను స్పష్టం చేయడానికి మాత్రం సిద్ధంగాలేడు. ఏ రాజకీయపార్టీ వాస్తవం పలకడానికి అంతకన్నా సిద్ధంగా లేదు. ఏమి చెబితే ఎవరికి కోపం వస్తుందోననే భయం, ఓటర్లు దూరమవుతారేమోననే సందేహం రాజకీయ పార్టీలను పట్టి పీడిస్తున్నాయి. ఈ భయ సందేహాలతో వాస్తవాన్ని స్పష్టం చేయలేక "ఏకాభిప్రాయం, ఏకాభిప్రాయం" అని మాత్రం అంటున్నారు. ఇది నిజంగా దురదృష్టకరం. అసలు దీనికి మూలకారణం_అధికార వ్యామోహామే అనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు.

గుజరాత్‌లో రిజర్వేషన్ల రగడ చిలికి చిలికి గాలివానై షుమారు 200 మంది అమాయకులు బలైనారు. మాధవ్ సింగ్ సోలంకి పదవీచ్యుతులైనారు. అయినప్పటికీ ఉద్యమం మాత్రం చల్లారలేదు. వ్యక్తులు రావచ్చు ; పోవచ్చు ; సమస్యలు మాత్రం పరిష్కారం కావడంలేదు; కావు కూడాను. ఈ జబ్బుకు అసలు కారణాలను అన్వేషించి సరైన మందు వేయకుండా, పై ఉపశాంతులతో ప్రయత్నించితే శాశ్వత ప్రయోజనం మాత్రం చేకూరదు. ఈ విషయం ప్రతి రాజకీయ నాయకునికి తెలుసు. అయితే ఎవరూ ముందుకు రావడానికి మాత్రం సాహసించరు. ఎవరు పిల్లి మెడలో గంట కట్టాలా ? అనేదే సమస్య. ఏ పార్టీ ముందుగా ఏ విషయం చెబితే ఎక్కడ ప్రమాదంవచ్చి మీద పడుతుందేమోననే భయంతో ప్రతి పార్టీ గోడమీద పిల్లి (Cat on the wall )లా వ్యవహరించడం పరిపాటి అయింది. ఇప్పటికైనా ఏకాభిప్రాయం ఆవశ్యకతను అందరూ గుర్తించడం హర్షించదగ్గ విషయం. ఈపాటి విజ్ఞతను లోగడే ప్రదర్శించివుంటే ఈ మారణ హోమం జరిగివుండేదే కాదు.

వెనుకబడిన తరగతులపై 30 సం. క్రిందట ఏర్పాటైన 'కాకా కాలేల్కర్' కమీషన్ నివేదికనుగాని, ఈమధ్య ఏర్పడిన "మండల్ కమీషన్" సిఫార్సులనుగానీ ఎటూ తేల్చకుండా, ఆయా రాష్ట్రాలే తేల్చుకోవాలని చెప్పి కేంద్రం తప్పుకుంది. రాష్ట్రప్రభుత్వాలు తమ రాజకీయ అవసరాల కనుగుణంగా రిజర్వేషన్ విధానాన్ని మలచుకుంటున్నాయి. "ఇక మీదట ఆర్థిక దారిద్ర్యాన్ని మాత్రమే వెనుకబాటుతనానికి, తద్వారా రిజర్వేషన్లకు ప్రాతిపదిక చేసుకొని అన్ని కులాల వారికి వర్తింపజేయాలి" అని అభిప్రాయబడిన "రాణే కమీషన్" రెండవ ప్రతిపాదనను తిరస్కరించి, మొదటి ప్రతిపాదనను మాత్రమే స్వీకరించి సోలంకీ ప్రభుత్వం ఎన్నికలలో గట్టెక్కడం కోసం రిజర్వేషన్లను 31 శాతంనుంచి 49 శాతానికి పెంచింది. ఆ తరువాత 28 శాతానికి పెంచుతామని వాగ్దానం చేయడంవలన గుజరాత్‌లో కల్లోలం చెలరేగింది. ఆయనకన్నా నాలుగాకులు ఎక్కువ చదివిన అర్జున్‌సింగ్ మధ్యప్రదేశ్‌లో ఒక్కపెట్టున 25 శాతంపెంచి నూటికి 78 ఉద్యోగాలను, కాలేజీ సీట్లను రిజర్వుడ్ కోటా క్రిందకు తెచ్చి గగ్గోలు పుట్టించారు. ఇలా ఎవరి స్వార్థంతో వారు అధికారాన్ని నిలబెట్టుకోవడం కోసం, వారికిష్టంవచ్చిన రీతిలో అధికార దుర్వినియోగంచేసి ప్రజలలో అగ్నిని రగులు కొలిపారు.

తరతరాలుగా అన్యాయాలకు లోనై అణగి మణగివున్న దళిత వర్గముల సముద్ధరణ కోసం, విద్యా ఉద్యోగాలలో తాత్కాలిక ప్రత్యేక సదుపాయములు ఏర్పరిచారు రాజ్యాంగకర్తలు. ఈ రిజర్వేషన్లు 10 సంవత్సరాలు అమలులోవుంటే చాలునని భావించారు. అయితే రాజకీయ ఎత్తుగడగా రిజర్వేషన్ గడువులను ఎప్పటికప్పుడూ పొడిగిస్తూ వస్తున్నప్పటికీ

బడుగువర్గాల జీవన పరిస్థితులు మాత్రం ఆశించనంతగ మెరుగు పడలేదు. ఈ రిజర్వేషన్ విధానం వలన షెడ్యూలు కులాలు, షెడ్యూలు జాతులు, వెనుకబడిన తరగతులలోని సంపన్న కుటుంబాలు మాత్రమే ఎక్కువగా లాభపడుతున్నాయి. అట్టడుగునవున్న అమాయకులు ఈ అవకాశాన్ని ఉపయోగించుకోలేక పోతున్నారు. బాబూ జగజీవన్‌రాం లాంటి సంపన్న కుటుంబాలు సహితం ఈ రిజర్వేషన్ సౌకర్యములు పొందవచ్చును. తమ కుటుంబాలను పోషించుకోవడానికి, తమ పిల్లలను ఉన్నత విద్యలను చదివించడానికి అవసరమైన, సరిపోయే ఆదాయం వస్తున్న ఐ. ఏ. యస్. ఆఫీసర్లుకూడా కుల ప్రాతిపదిక మీద ఈ రిజర్వేషన్ సౌకర్యాలను అనుభవించవచ్చును. అగ్రకులాలకు చెందిన వారికి తినటానికి తిండి లేకపోయినా, తమ పిల్లలను చదివించుకోవడానికి మాత్రం ఈ రిజర్వేషన్ సౌకర్యం వారికి వర్తించదు. పేదరికాన్ని పరిగణనలోనికి తీసుకొనకుండా, కేవలం కులాన్నే ప్రామాణికంగా తీసుకొని, వెనుకబడిన తనాన్ని నిర్ణయించడం వలన రిజర్వేషన్ విధానం ప్రధానాశయమే వమ్మయింది. కొన్ని కొన్ని సందర్భాలలో ఈ ప్రస్తుత రిజర్వేషన్ పద్ధతి వలన, కొంతకాలం ఒక ఉద్యోగిక్రింద జూనియర్‌గా పనిచేసిన వ్యక్తికి (రిజర్వుడు కులాలకు చెందిన) ప్రమోషన్‌వచ్చి ఆఫీసర్ అయిపోవడం, సీనియారిటి వున్నప్పటికీ అతను అగ్రకులానికి చెందినవాడు కావడంవలన ప్రమోషన్ రాకపోవడం జరుగుతున్నది. అప్పుడు వారిద్దరిమధ్య వైషమ్యాలు, కలతలు పెరగడానికి అవకాశం ఏర్పడుతున్నది. కాలం గడిచిన కొద్దీ రిజర్వుడుకోటా తగ్గుముఖం పట్టకపోగా నానాటికి పెరుగుతున్నది. ప్రతిభకు అనేక రంగాలలో అవకాశం లేకుండా పోతున్నది. యువతలో నిరాశా, నిస్పృహలు జనిస్తున్నాయి. వైషమ్యాలు రగులుతున్నాయి. ఆందోళనలు చెలరేగుతున్నాయి. మారణహోమాలు జరుగుతున్నాయి. అశాంతి ప్రబలుతున్నది.

అట్టడుగునవున్న దళితవర్గాల ప్రజలను సముద్ధరించడానికి ఎవరూ వ్యతిరేకులుకారు. వ్యతిరేకించేవాడు నిజంగా దేశద్రోహులే. అయితే అనుభవించడానికి కావలసినంత ధనం వున్నవారు సహితం రిజర్వుడు కులాలకు చెందినవారు కావడమనే నెపంతో ఈ ప్రత్యేక సౌకర్యాలను పొందాలని కాంక్షించడం ఏ మాత్రం న్యాయంకాదు. దురదృష్టవశాత్తు అగ్రకులాలలో జన్మించి, ఒకపూట తిండికికూడా నోచుకొనని నిర్భాగ్యులకుకూడా ఈ రిజర్వేషన్ సౌకర్యములు వర్తించక పోవడం మాత్రం నిజంగా దురదృష్టకరం. ఈ విధానం అమలులో వున్నంతకాలం, కులాలమధ్య సామరస్యాన్ని సాధించడం దుర్లభం. ఈ పద్ధతి వుండటంవలననే విద్యాసంస్థలలో చేరేటప్పుడు పూర్తిచేయవలసిన అప్లికేషన్ ఫారములో సహితం కులము పేరు వ్రాయవలసివస్తున్నది. ఈ పద్ధతి కొనసాగినంత కాలం మనమంతా ఒకే జాతీయులం అనే భావనకు అవకాశం లేకుండా పోతున్నది. భగవంతుని దృష్టిలో మనమంతా ఒకే కులం. మనలో ఒకే రక్తం ప్రవహిస్తున్నది. స్వార్థంతో, సంకుచితత్వంతో మనం ఏర్పర్చుకున్నవే ఈ అడ్డుగోడలు. ఈ అడ్డుగోడలు వైదొలగి "ఏకాత్మ దృష్టి" పెరగాలంటే ప్రస్తుత రిజర్వేషన్ విధానంలో మార్పురావాలి.

జాతీయస్థాయిలో ఈ విషయమై సమగ్రచర్చ జరగాలి. వివిధ రాజకీయపార్టీలు, నిపుణులు చర్చించి ఏకాభిప్రాయాన్ని కనుగొనాలి. దేశ పరిస్థితులకు, ప్రజల అవసరాల కనుగుణంగా రిజర్వేషన్ విధానాన్ని సంస్కరించాలి. సమాజంలోని అన్నివర్గాల ప్రజల ప్రయోజనాలకు భంగం కలగని రీతిలో, వారి అభ్యున్నతికి తోడ్పడే విధంగా రిజర్వేషన్ విధి విధానాలను రూపొందించాలి. అర్హత, అవసరంవున్న వారికి మాత్రమే ప్రత్యేక సదుపాయములు ఉపయోగపడేట్లు చూడాలి. సంపన్నులు (వారు ఏ కులానికి చెందిన వారైనాసరే) మాత్రం ఈ ప్రత్యేక సదుపాయములను వినియోగించుకోవడానికి అవకాశం లేకుండా చేయాలి. ఆర్థిక దారిద్ర్యమే పునాది కావాలి. ఇది చాలా సున్నితమైన సమస్య. అందులో జాతీయసమస్య. జాతి పురోభివృద్ధికి, సమైక్యతకు భంగం వాటిల్లని విధంగా ఈ సమస్యను పరిష్కరించాలి. ఈ ప్రధాన సమస్యను పరిష్కరించడానికి అరమరికలు లేకుండా అన్ని రాజకీయపక్షములు open mind తో ముందుకు రావాలి. "ఆలస్యం అమృతం విషం" అనే లోకోక్తిని విస్మరించరాదు.



శ్లో॥ ప్రియప్రాయా వృత్తిః వినయమధురో వాచి నియమః
ప్రకృత్యా కల్యాణీమతి రనవగీతః పరిచయః
పురోవా పశ్చాద్వా తదిద మవిపర్యానితరసం
రహస్యం సాధూనా మనుపధి విశుద్ధం విజయతే ॥

లోకంలో మనుష్యుల చిత్తవృత్తులు విభిన్నంగా వుంటాయి. ఎవరి చిత్తం వారి అధీనంలో వుండటమనేదే కష్టం. ఇక ఆ మనస్సు తాలూకు వ్యాపారాన్ని, స్వేచ్ఛను అరికట్టటం సాధ్యమా ? అసలు ఒక మనిషిని అర్థం చేసుకోవాలంటే ప్రథమంగా అతని మనఃప్రవృత్తిని గమనించాల్సి వుంటుంది. తన చిత్తవృత్తి భిన్నంగా ఎవడూ ప్రవర్తించడు. ఈ చిత్తవృత్తి సర్వకాలాల్లోను ఒకే మాదిరిగా వుంటుందని చెప్పటానికే వీల్లేదు. మార్పు మనోలక్షణం. మనస్సే మనిషిని బంధంలోనూ పడేస్తుంది, విముక్తిని ప్రసాదిస్తుంది. ఇదీ చిత్తవృత్తి తీరు. దీన్ని చెప్పుచేతల్లో పెట్టుకోటానికే మానవుడు నిరంతరం సతమతమౌతున్నాడు. ఎంత సాధన చేసినప్పటికి కృతకృత్యులయ్యేవారే కొద్దిమందో !

# అమృతవాణి

## కూచిభొట్ల చంద్రశేఖరశర్మ

మనోవ్యాపారాన్ని నియమించేసే నైర్మల్యం సాధించిన వారు సాధువులు. అంటే సత్పురుషులన్నమాట. ఈ సజ్జనుల చిత్తవృత్తి మిగిలినవారి చిత్తవృత్తికంటే భిన్నంగా వుంటుంది. చాలా విలక్షణమైన లక్షణాలుంటాయి. ఇది యెలా నిర్ణయించటమంటారా ? సాధువులు ఎదుటివారితో వ్యవహరించే తీరునుబట్టి, వాళ్ళ నిత్య కార్యక్రమాన్నిబట్టి నిర్ణయించవచ్చు. మనస్సు, వాక్కు, శరీరం యీ మూడు సాధువులకు ఒకే తీరులోవుంటాయి. ఈ మూటికి మంచి సమన్వయముంటుంది వారిలో. సాధువులు శారీరకంగాచేసే ప్రతిపని యితరులకు ప్రీతినే కలిగిస్తుంది. అప్రీతిని, అసహ్యతను ఎన్నడూ కలిగించదు. ఇక వాళ్ళమాటలు మితంగా హితంగా రమణీయంగా వుంటాయి. ఆ మాటలో ఒక కట్టుబాటుంటుంది. ఆ మాటలో ఒక వినసొంపైన మధురిమ నిండుగావుండి వినయముట్టి పడుతూంటుంది. వారి ఆలోచన పద్ధతిచూస్తే అది అందరికి మేలు కలిగించేదిగా వుంటుంది. లోక కల్యాణ హేతువవుతుంది. అది వారి సహజమైన బుద్ధి. ఎప్పుడూ శుభాన్నే కోరుకుంటుంది. చెడు తలపనేది యెన్నడూ వారిలో వుదయించదు.

ఇంకా అలాటి సత్పురుషులతో కొంచెం పరిచయం కలిగినా కొండంత ప్రయోజనం కలుగుతుంది. అది మన అదృష్టంగా భావించటం మంచిది. పవిత్రమైన వారి స్నేహ పరిచయం కలకాలం ప్రశంసింపదగింది. దీన్ని సత్సంగమనవచ్చు. ఈ సత్సంగంవల్ల ఎన్నో ప్రయోజనాలు కలుగుతాయి. వారి సమక్షంలో, వారి సాంగత్యంలో, వారి మాటల్లో ఎంతటి ప్రీతి కలుగుతుందో వర్ణనాతీతం. ఆ అనుభూతి విశేషం మన హృదయాల్లో మాధుర్యం నింపుతుంది. వారి సమక్షంలో ఎంతో వారి పరోక్షంలోకూడా అంతే. వారి స్నేహానుభూతి తల్చుకొన్నా, వారి మాటల తీరు స్మరించినా, తిరిగి పూర్వపు అనుభూతే కలిగి అప్పటి తీయందనాలనే మనసునిండా నింపుతుంది. అంటే పరోక్షంగా కూడా ప్రీతిని కలిగించటంలో ఎలాంటి భేదాన్ని గమనించలేము. అలాంటి సాధుజనులను స్మరిస్తేనేచాలు కావలసినంత మనశ్శాంతి కలుగుతుంది. సాధుపురుషల తత్త్వ సహజ శుద్ధమైంది. అదే రహస్యం. అంటాడు

"సత్సంగత్వే నిస్సంగత్వం, నిస్సంగత్వే నిర్మోహత్వం, నిర్మోహత్వే నిశ్చలతత్త్వం" అంటాడు శంకరాచార్యస్వామి.



శ్రీవాణి

 ( గతసంచిక తరువాయి )

# ఇందిరా కాంగ్రెసు శతాబ్ద్యుత్సవాలు !!

## గాంధీజీ విచారం

మహాత్మాగాంధీ దేశ విభజనను సుతరాము అంగీకరించలేదు. ముందు తమను ఖండించి, ఆ తర్వాత దేశాన్ని ఖండించమన్నారాయన. కాని ఆ విషయంలో ఆయన "కాంగ్రెసు"ను, అదుపుజేయలేక పోయినారు.

దేశ విభజన సమయంలో "కాంగ్రెసు" వారు ఉత్సవ కోలాహలంలో సంబరపడిపోతుంటే ఆయన ఖిన్నుడై గడిపారు. పలువురు "కాంగ్రెసు" నాయకులు "మనం (దేశం) విడిపోతున్నది తిరిగి ఏకమయ్యేందుకే" అని ప్రజలకు చెప్పారు. 1950 వ దశక లో నెహ్రూ "పాకిస్థాన్ ఒక ఫియట్ ఎ కాంప్లి ( జరిగిపోయిన వాస్తవం )" అని ప్రకటించేవరకు ప్రజలు "ఇంకా దేశం తిరిగి ఏకమవుతుందేమో" ననే భావాలనే నమ్ముకున్నారు.

## కాంగ్రెసు రద్దుకు గాంధీజీ ఆదేశం

"కాంగ్రెసు"లో ఏర్పడ్డ లాబీలతో సంస్థ దుర్బలమై పోయి గాంధీజీ దేశ విభజనను నివారించలేకపోయినట్లే, అప్పటికే కొందరు "కాంగ్రెసు" ప్రముఖుల్లో ఏర్పడిన అధికార దాహాన్ని కూడా అదుపుచేయలేక పోయినారు. తాను సుతరామూ ప్రభుత్వాధికారం జోలికి పోలేదు. అసలు "కాంగ్రెసు" సంస్థలోని అధికారాలకు కూడా పోలేదు. నైతిక బలంతో, ఉద్యమ బలంతోనే వ్యవహరించారు. స్వంత ఆధిపత్యానికి గాని, స్వకుటుంబ ప్రయోజనాలకు గాని స్థానం ఇవ్వలేదు. విరాగిగానే గడిపారు. కాని లాబీలను అదుపు చేయడం మాత్రం సాధ్యం కాలేదు. మొదట్లో 120 ఏళ్ళు జీవించదలిచానన్న మహాత్మాగాంధీ విసిగి వేసారి, నాకు ఇహ బ్రతకాలని లేదనేవరకు నిస్పృహ చెందారు. కాంగ్రెసు ప్రముఖుల కొందరిలో పేరుకుపోయిన అధికార దాహాన్ని నిరసించారు. అప్పటికి దేశంలో విభజన ఫలితంగా జరుగుతున్న రక్తపాతాన్ని ఆపుజేసేందుకు, సఖ్యతను సాధించేందుకు జీవితాన్ని అంకితం చేద్దామనుకున్నారు. అధికారం చేజిక్కించుకున్నా వారు పార్టీ మనస్తత్వంలో పడకుండా జాతీయ ప్రభుత్వాన్ని నడపమన్నారు. కాంగ్రెసేతరులను కూడా ప్రభుత్వంలోకి తీసుకోమన్నారు. అలా కొందరిని తీసుకున్నారు. "కాంగ్రెసు" పేరును అధికారం కోసం వాడుకోవద్దని, కాంగ్రెసు సంస్థను రద్దుచేసి మీ మీ సిద్ధాంతాలకు తగిన పార్టీలు పెట్టుకోమన్నారు. ఆయన మాట ఎవరూ పట్టించుకోలేదు. కాంగ్రెసు పేరుతో వున్న "గుడ్ విల్"ను అనుభవించడానికే నిశ్చయించుకున్నారు. చెట్టు పేరు చెప్పి కాయలు అమ్ముకొన చూడాలనుకున్నారు. నేటికీ అదే ఇంకా సాగించాలని చూస్తున్నారు. ఇందిరాగాంధీ తాను పెట్టిన పార్టీకి కూడా "కాంగ్రెసు" పేరును వాడడంలో అది గమనించవచ్చు. ( అందుకు పోటీగా ఇతరులు వాడడంలో కూడా అది కనిపిస్తుంది ).

## దేశవాణి

## కాంగ్రెసు అంతరింపు

గాంధీజీ ఏనాడు "కాంగ్రెసు"లో అసహాయులై పోయినారో ఆనాడే కాంగ్రెసు అంతరించిపోవడం ఆరంభమయిందని చెప్పుకోవచ్చు. ఏనాడు ఆయన దానిని రద్దు చేయమన్నారో ఆనాడు పూర్తిగా అంతరించిపోయిందని చెప్పుకోవచ్చు.

## గాంధీ తత్వానికి తిలోదకాలు

"కాంగ్రెసు" పేరు వాడుకుంటున్నప్పటికీ ఆ యా వర్గాలలో గాంధేయ ప్రాబల్యం, సిద్ధాంతాలయినా ఏమీ మిగలలేదు. చిహ్నాలు సైతం మిగలలేదు. మొన్నటి ఎ. ఐ. సి. సి. (ఐ) సభలో ఒకే ఒక్క గాంధీటోపీ కనిపించిందట. ఆ సమూహంలోను, వారి అనుచరుల లోను ఎందరు స్వదేశీవాదులో, ఖద్దరు వస్త్రధారులో, నీతివంతులో, అహింసాపరులో, మద్యపాన నిరోధకులో — ప్రత్యేక పరిశోధనలో తేలవలసిన విషయమే! (చివరకు "గాంధీ" అనే పేరుమీద పరిశోధన జరుగదగి ఉంది. ఇందిరా "గాంధీ", రాజీవ్ "గాంధీ" అనే పేర్లు వినిపిస్తున్నాయి.

మహాత్మా "గాంధీ" ఈ "గాంధీ" లకు సంబంధం ఏమీ లేదు. మహాత్మాగాంధీ గుజరాతీ హిందువు. అది వారి వంశ నామం. ఈ "గాంధీ" లు పార్శీ వంశస్థులు. పార్శీలలో "గాంధీ" వంశ నామం ఉన్నట్లు కనిపించదు. గ్యాండి లేదా గ్యాంధి ఇలా పలుకదగిన GANDY, GANDHY ఈ మాదిరి శబ్దాలు కొన్ని కనిపిస్తాయి. మరి వీరికి ఈ పేరెలా వచ్చిందో, అది కూడా రాజకీయ ప్రయోజనాలకోసం, సవరింపబడిన పెట్టుడు పేరో పరిశోధనార్హం)

## రష్యా పెంపుడు పార్టీ

మొత్తంమీద 1948 నాటికి మహాత్మా గాంధీజీ వెళ్ళిపోయినారు. అంతకుముందే "కాంగ్రెసు" వెళ్ళిపోయింది. ఆ పేరుతో స్వతంత్ర భారతంలో నెహ్రూ ఆధిపత్యంలో రాజకీయాలు ఆరంభమయినాయి. ఈ దేశ ప్రజలు స్వభావతః సాత్వికులు. వీరారాధకులు. నాయకులనబడేవారి పట్ల భక్తి గౌరవములు కలవారు. "జన వాక్యంబు కర్తవ్యం" అని నమ్మే ప్రజాస్వామికతత్వం గలవారు. శాంతి ప్రియులు. తటస్థతా ప్రియులు.

"ఏకం సత్ విప్రా బహుధావదంతి" అనే సర్వమత సమ్మాన పూర్వకమయిన ఆధ్యాత్మిక చింతన కలవారు. నెహ్రూ ఇందుకు అనువైన నినాదాలు, ప్రసంగాలు అవలంబించారు. తమ సిద్ధాంతాలకు ఈ తత్వాన్ని అన్వయించి, తమ రాజకీయ విధానాలు ప్రకటించేవారు. ఈ ధోరణి క్రింద ప్రజాస్వామ్యం, అలీన విధానం, సెక్యూలరిజం, సోషలిజం, ఇత్యాది మాటలన్ని దేశంలో తేలికగానే చెలామణి అవుతూ వచ్చాయి. అంతేకాదు, నెహ్రూ, నెహ్రూఇజాలకు సంబంధించి రాజకీయ మూఢ భక్తి కూడా వ్యాపించింది. ఆయన తత్వాన్ని విధానాలను విమర్శన చేయరాదనే మూర్ఖత వ్యాపించింది. దీనితో దేశంలో సామాన్య ప్రజల్లో నెహ్రూ విధానానికి అతీతంగా ఆలోచించడమే స్తంభించి పోయింది. దెబ్బమీద దెబ్బ అన్నట్లు నెహ్రూ కుటుంబీకులే ఏలికలవుతుండడంవల్ల ఈ నష్టం మరీఎక్కువ అవుతోంది. ఈ దేశంలో కనీసం ఒక 10 సంవత్సరాలు నెహ్రూ పేరు, కాంగ్రెసు పేరు వినిపించకపోతే, స్వతంత్రంగా ఆలోచించడం ఆరంభమవుతుందేమో! కాంగ్రెసును రద్దు చేయవలసిందగా గాంధీజీ ఆదేశించిన విషయం ప్రచారంలోకి తీసుకురాకుండా తొక్కిపెట్టారు గనుక "కాంగ్రెసు" పేరు కూడా చలామణి అవుతూనే వచ్చింది. పార్లమెంటరీ వ్యవస్థ, రాజ్యాంగం, మైనారిటీల రక్షణ, అలీన విధానం — ఇత్యాదులన్నీ నెహ్రూ నేర్పిన అంశాలుగా నేటికీ చెలామణీ అవుతూనే వున్నాయి. అంతర్జాతీయ విషయాల్లో నెహ్రూకు సాటిలేరనే ఖ్యాతి కూడా వుంది. అందువల్ల ఆయన చెప్పిందానికి తిరుగు లేకుండా చెలామణీ అవుతూనే వచ్చారు. నెహ్రూ హయాంలో కాంగ్రెసు అనబడే ఉద్యమ సంస్థ క్రమంగా అసందిగ్ధమైన పార్టీగా రూపొందింది. కమ్యూనిష్టు పార్టీ రష్యాకు కన్నబిడ్డ అయినా ఈ కాంగ్రెసు పార్టీ రష్యా పెంపుడు బిడ్డ అయింది. కమ్యూనిష్టు పార్టీ ద్వారా సాధించలేని దానిని రష్యా ఈ కాంగ్రెసు ద్వారా సాధించుకో జొచ్చింది. నెహ్రూ ప్రజాస్వామ్యం అని చెప్పినా ఆయన ప్రతి పక్షం అనేది లేకుండా ఉండే జాగ్రత్తలు తీసుకున్నారు. ఎప్పటికప్పుడు ఎన్నికలు జరిపించినా, అభ్యర్థులకు టిక్కెట్లు పంచే సమయంలో పూర్తి జాగ్రత్త తీసుకుని,

నిరంతరంగా తమ విధేయ బృందం ప్రాబల్యంలో ఉండేలా చూచేవారు. ఆయన కాలంలో "లాయల్టీ" అనే పదం ఎక్కువగా పార్టీలో వాడకపోయినా ఇందిరాగాంధీ హయాంలో ఈ పదం వాడడంలోకి బాహాటంగానే వచ్చింది. అంటే పార్టీకి గాక, తమకు విధేయులుగా ఉండే వారికే పార్టీలో గణ్యత అనే విధానం. ఇందుకు ఎవరైనా ఎదురునిల్చే సందర్భాలు లేకుండా ప్రభుత్వంలో ప్రధాని పదవి, పార్టీకి అధ్యక్ష పదవి తనదే ( లేదా తనచే నియుక్తుడైన వారిదే ) అనే నిరంకుశ విధానం కూడా ప్రవేశ పెట్టారు. తమ కుమార్తెను ప్రధాని చేసే ఉద్దేశం లేదంటూనే అందుకు తగ్గట్లుగా "కాంగ్రెసు" బలగాన్ని అధిష్ఠాన వర్గాన్ని, పార్లమెంటరీ బలగాన్ని తీర్చిదిద్దేవారు. ఇందిరాగాంధీ కూడా తమకు రాజకీయాలు, ప్రధానమంత్రిత్వం ఇష్టం లేదంటూనే ఆ పదవికి తేలికగా వచ్చారు. ( మధ్యలో అనివార్యంగా లాల్ బహద్దూర్ శాస్త్రి వచ్చినా, అది అర్థాంతరంగా ముగిసిపోవడంతో ; ఇందిరాగాంధీకి అవకాశాల పరిస్థితి చెక్కుచెదరలేదు )

అప్పటికి దేశంలోను, కాంగ్రెసులోని పెద్దల్లోను వ్యూహం క్రమంగా అర్థమవుతూ వచ్చింది. పార్లమెంటరీ బలగంతో పార్టీ ఆధిపత్యాన్ని త్రోసిరాజనే పద్ధతిలో ప్రజాస్వామ్యానికి వున్న ప్రమాదాన్ని గుర్తించారు. పార్టీ రాష్ట్రపతి పదవికి సంజీవరెడ్డిని అభ్యర్థిగా నియమిస్తే, ప్రధానిగా వున్న ఇందిరాగాంధీ ముఠాగట్టి జడిపించడం, ప్రభుత్వ యంత్రాంగం, రేడియో, ప్రచార యంత్రాంగాన్ని వాడి పార్టీ ప్రాధాన్యతను త్రోసిరాజనడం ఇవన్ని బాగా అవగాహనకు వచ్చాయి. చివరకు ఆమెను "కాంగ్రెసు పార్టీ" నుండి బహిష్కరించారు.

## ఇందిరాగాంధీకి పార్టీ బహిష్కరణ

తనను నిలిపిన పార్టీయే, పార్టీ కార్యవర్గమే తనను పార్టీ నుండి బహిష్కరించినా ఆమె పార్లమెంటు సభ్యత్వానికి, ప్రధాని పదవికి రాజీనామా చేయలేదు. రాజ్యాంగంలో అట్టి కర్తవ్యం ఏమీ లేకపోవడంతో

## స్వదేశీ అభిమానము

ఒకనాడు డా॥ భోగరాజు పట్టాభి సీతా రామయ్యగారిని ఒక మిత్రుడు అల్పాహార మునకు ఆహ్వానించినారు. అక్కడ డాక్టర్ పట్టాభి ఆ అల్పాహార విందులోని ITEMSను గురించి చమత్కారంగా వ్యాఖ్యానించారు. "ఇచ్చే కాఫీ ఫ్రెంచిది, చక్కెర జావాది, కలిపేది ఆస్ట్రేలియన్ టిన్ మిల్క్, త్రాగేది జపాన్ కప్పులో, కలియబెట్టేది జర్మన్ స్పూన్‌తో, మరగకాచేది అమెరికన్ స్టౌపైన, కాగబెట్టేది బర్మా ఆయిల్‌తో, తినేది గ్లాస్కో బిస్కట్లు, టేబుల్‌పైన పరచిన గుడ్డ లాంకెషైర్ మిల్లుది, తుడుచుకునే చేతిరుమాలా టర్కిన్ నాప్కిన్, కాలి క్రింద కార్పెట్ డెన్మార్కుది, ఎదురుగా వుండే అద్దం బెల్జియంది. ఇకపోతే వాటిల్లోవుండే స్వదేశీయం కేవలం నీరు మాత్రమే. కాబట్టి అదొక్కటే యివ్వండి చాలు" అని డా॥ పట్టాభి హాస్యంగా అనడంతోనే అక్కడి మిత్రులందరూ ఆశ్చర్యపోయారు. అంతేకాదు ఆయనకు వున్న స్వదేశీ అభిమానం ఎంతటిదో అవగాహన చేసుకున్నారు.



ఆ పరిస్థితిని బాగా వినియోగించి అధికారం కొనసాగించింది. పాతకాలపు కాంగ్రెసు అనబడేది ఏమైనా వుంటే దీనితో అది కూడా రూపుమాసిపోయింది.

## సొంత పార్టీ

ప్రధానమంత్రి పార్లమెంటును రద్దుచేసేందుకు వున్న అధికారాలను పురస్కరించుకొని, ప్రభుత్వ

## మార్పు

'అంబా' అని అరిచే
ఓ లేగదూడ
సినీ వాల్‌పోస్టర్లు తినీతినీ
'రంభా' అని అరిచిందట !
ఇదండీ మన సినిమాల ఘనత !
మనం సాధించిన నవ్యత !

— నారంశెట్టి ఉమామహేశ్వరరావు

పలుకుబడి, రేడియో ప్రచారాల అండదండలు, దుర్బల వర్గాల పేరిట నినాదాలు, మహిళగా కంటతడి, ఇలాంటి వన్నీ ప్రయోగించి, జనంతో సూటి సంపర్క విధానాలతో ఎన్నికలు నడిపించి 1970 వ దశకం వచ్చేసరికి "నేనే పార్టీ, నేనే దేశం, నేనే ప్రజలు" అనే స్థితికి చేరింది. ఇంకా అడ్డులు, అవరోధాలు లేకుండా ఎమర్జన్సీ ప్రయోగంతో తన పార్టీలోని జగజీవన్‌రాం వగైరాలను వదిలించుకుంది. ఈ అధికార పిపాసా తంత్రం అంతా అన్ని పార్టీల నాయకులకు అర్థమయినా, ఈ జనసామాన్యానికి అవగాహన అయిన స్థితి రాలేదు. అందువల్ల జనం ఒకసారి యాదృచ్ఛికంగా ఆమెను ఎన్నికల్లో ఓడించినా, మళ్ళీ వెంటనే తిరిగి రాగల్గింది. అప్పటికీ ఇంకా కొందరు "కాంగ్రెసు-ఒ" అంటూ వ్రేలాడుతుంటే "కాంగ్రెసు-ఐ" అంటూ మరో పార్టీ పెట్టింది. హస్తం గుర్తుతో కథ నడిపింది. పార్టీకి తిరుగులేని నాయకురాలయింది. పార్లమెంటు, పార్టీయంత్రాంగమే కాకుండా రాష్ట్రాల్లో ముఖ్యమంత్రులుగా తన తాబేదార్లను పంపడం ఆరంభించింది. తనపట్ల "లాయల్టీ" (విధేయత) ఒక్కటే అర్హతగా పార్టీలోను, బయట "ప్రజాస్వామ్యం"గా తీర్చిదిద్దింది. ఆమె ఆకస్మికంగా వెళ్ళిపోవడంతో, ఇంకా ఆమె భౌతికకాయం అక్కడ ఉండగానే రాజీవ్ గాంధీ విమానంలోనుంచి సునాయాసంగా ప్రధాని పీఠం మీదకు, పార్టీ అధ్యక్షపీఠం మీదకు వెళ్ళిపోయినారు. ఇక అందరినీ ఆమోదముద్ర వేయమన్నారు. పార్లమెంటరీ పార్టీ వేసింది. రాజీవ్ ఎవరో ఏమిటో తెలియకుండానే, తెలుసుకోకుండానే ఓటర్లూ ముద్రవేశారు. తమకేదో ఐక్యత ఉందనుకున్న ప్రతిపక్షాలు (51 శాతం ఓట్లు తెచ్చుకొనికూడా) బిత్తర పోయినాయి. తాజాగా జరిగిన ఏఐసిసి (ఐ) ఆమోదముద్రకూడా పడింది. స్వరాజ్య ఉద్యమంతో ఏమాత్రం సంబంధంగాని, దేశంకోసం శ్రమించడంలో ఏమాత్రం పాత్రగాని లేని వ్యక్తి స్వరాజ్య ఉద్యమాన్ని గురించి తమ కుటుంబ త్యాగాలను గురించి భారతజాతికి పాఠాలు చెప్తున్నాడు.

విజ్ఞులు, విషయజ్ఞులు పట్టించుకొనక పోయినప్పటికి మిగిలివున్న స్వాతంత్ర్య సమరయోధులు నిరాకరించి, జాతీయ స్వతంత్ర పోరాటం నుండి చీలివచ్చిన వివిధ జాతీయ పార్టీలు దూరంగా ఉన్నప్పటికి ఇదే అసలైన కాంగ్రెసు, ఇదే స్వాతంత్ర్యోద్యమ కాంగ్రెసు, గాంధీజీ కాంగ్రెసు, ఆశయాలు ఏమాత్రం మారని కాంగ్రెసు, నెహ్రూ వంశ త్యాగాలతో నిర్మాణమైన కాంగ్రెసు ఇత్యాదులన్ని చెప్తున్నాడు. ఆశ్రితులు హర్షధ్వానాలు చేస్తున్నారు. పత్రికలు రేడియో, టి. వి. ప్రచారం చేస్తున్నాయి. దేశం విస్తుబోయి చూస్తూవుంది.

## గంగా కాంగ్రెసు

గంగానది దేశానికి ఆధ్యాత్మిక గంగ అయితే "కాంగ్రెసు" రాజకీయ గంగ అన్నారు శ్రీ రాజీవ్‌గాంధీ. అది జాతీయ స్వాతంత్ర్యోద్యమ పునీత కాంగ్రెసు వరకు చెప్పుకోవచ్చు. ఆతర్వాత అందులోకి మురుగుకాల్వలు చాలా ప్రవేశించాయి. గాంధీ కాంగ్రెసును రద్దుచేయమనడంతో ఆ గంగ కాంగ్రెసు ఇంకిపోయినట్లే. ఇక తర్వాతవి అన్ని మామూలు కాలువలో, మురుగుకాలువలో అనుకోవాలి. ప్రస్తుతం ఉత్సవం జరుపుకుంటున్నదానిని

గంగ అనడం చాలా అన్యాయం దానిని పెద్ద పురుగు కాల్వ అంటే అనాలి.

ఘన గౌరవ స్వరాజ్యోద్యమ కీర్తి వాసనలు పొందిన "కాంగ్రెసు" అనే పేరు నేడు భారతజాతి అనే గోమాత ముందు చేటపెయ్యవలె నిలిచివుంది. దానిని చూపించి ఓట్లు అనే పాలు పిండుకొనజూస్తున్నది ప్రస్తుత పాలక వర్గం. పాత గొడుగు ఒకదానికి షష్టిపూర్తి ఉత్సవం చేశాడొక ప్రబుద్ధుడు. 60 ఏళ్ళక్రితం వాళ్ళ తాతకు ఆ గొడుగును ఎవరో దానం చేశారట. ఈ 60 ఏళ్ళలో ఆ గొడుగు గుడ్డ ఆరుసార్లు, చువ్వలు పదిసార్లు, కర్ర పన్నెండుసార్లు మారింది. మొదట్లో ఉన్నది ఏ ఒక్కటీ ఇప్పుడు లేదు. చాలాసార్లు మారాయి. అయినా ఈ గొడుగు మా యింట్లో 60 ఏళ్ళనుండి ఉందంటాడు. వాళ్ళ తాతకు దానంగా సంక్రమించిందే అంటాడు. రాజీవ్‌గాంధీ నేడు కాంగ్రెసు శతాబ్ది ఉత్సవాలు అంటే ఆ గొడుగు కథ గుర్తుకొస్తోంది.

అన్ని జాతీయ పక్షాలు, అందరు జాతీయ నాయకులు, ప్రజలు కలిసి ఈ ఉత్సవాలను జరిపివుంటే దానికి ఎలాంటి ప్రతిష్ఠ లభించివుండేదో కాని, ఇప్పటి తీరులో – ఇది "ఇందిరా కాంగ్రెసు శతాబ్ద్యుత్సవాలే" అవుతున్నాయి.

కాంగ్రెసుపేరుతో నూరేళ్ళుగా జరిగిన, నేటికీ జరుగుతున్న కథఇది. ఇక్కడ టూకీగా చెప్పబడినా, నవతరాల వారు ప్రత్యేక అధ్యయనం ద్వారా తెలుసుకొనాలి. అలా అధ్యయనం చేస్తేగాని వీరి ప్రచారాల్లో దగా ఎక్కడుందో తెలియదు. విషయజ్ఞులు ప్రజలముందు వివరించదగిన చరిత్ర ఇది. ఈ ఉత్సవాలను బహిష్కరించినవారు, వివిధ పార్టీలనాయకులు ఈ సమయంలో సమగ్ర జాతీయ స్వాతంత్ర్య పోరాటవిశేషాలను, ఆయా మహనీయులను గురించి ప్రజానీకానికి తెలపడం, దగానుండి బయట పడవేయడం భావ్యము, అవసరము.

# నిరాడంబరత

మాజీ రక్షణమంత్రి మహావీరత్యాగి ఒకసారి అప్పటి ఉప ప్రధాని అయిన సర్దార్ వల్లభాయిపటేల్ ఇంటికి వెళ్ళారు. అక్కడ "సర్దార్" కూతురు "మణీబెన్"ను చూసారు. ఆమె మాసికలువేసిన ధోతిని చీరెగా కట్టుకొని వుంటుంది. త్యాగి ఆశ్చర్యంతో "మణీబెన్! ఇంత గొప్పవ్యక్తి కూతురువై ఇటువంటి మాసికల చీరె కట్టుకోవడం ఏం బాగుంది? నీవు ఒకవేళ ఈ చీరెతో బజారుకు వెళ్ళితే బిచ్చపుదానవనుకొని అందరూ నీకు బిచ్చం వేస్తారు" అని అంటారు.

అప్పుడు మణీబెన్ కోపంతో "అవినీతి సంపాదనతో సిగ్గుపడాలిగాని, మేం కష్టపడి సంపాదించే వాళ్ళం. సిగ్గుపడాల్సిన పనిలేదు." అని అన్నది. ప్రక్కనేవున్న పటేల్ నవ్వుతూ త్యాగితో "మంచిదేగదా! అట్లయితే చాలా పైసలు పోగౌతాయన్నమాట" అని చమత్కరించారు.

అక్కడనేవున్న డా. సుశీలానయ్యార్ కల్పించుకొని "త్యాగిజీ! మీరు ఎవరితో మాట్లాడుతున్నారు? మణీబెన్ సంగతి మీకు తెలియదు. ఆమె రోజంతా సర్దార్‌జీ సేవ చేస్తుంది. తరువాత దినచర్య వ్రాస్తుంది. తదుపరి నియమంగా రాట్నం వడుకుతుంది. దానితో వచ్చిన దారంతో సర్దార్‌జీ ధోవతి, చొక్కా తయారవుతాయి. సర్దార్‌జీ మీలాగే ఖాదీభండారుకు వెళ్ళి బట్టలు కొనుక్కోరు. సర్దార్‌జీ ధోవతి చినిగిపోయిన తరువాత మాసికలువేసుకొని దానిని మణీబెన్ చీరగా కట్టుకుంటుంది. చినిగిపోయిన చొక్కాను కత్తిరించి రవికగా కుట్టుకొంటుంది" అని చెప్పింది. ఇది విని మహావీర్ త్యాగి తానుచేసిన పొరపాటుకు ఎంతో పశ్చాత్తాపపడి సిగ్గుతో తలవంచుకుంటాడు.

వ్యక్తి ప్రతిభను చాటేది బట్టలుకావు. అలంకారాలు అంతకన్నా కావు. అతని నిరాడంబరత, సౌశీల్యములు మాత్రమే శాశ్వతమైన కీర్తి ప్రతిష్ఠలను సముపార్జించి పెడతాయి. ★

# భారతదేశ విభజన కారణాలేమిటి? కారకులెవరు?

కొ మ ర గి రి

పరమ పవిత్రమైన భారతభూమిని వందలాది సంవత్సరాలు బ్రిటీష్ సామ్రాజ్యాధినేతలు తమ విష కబంధ హస్తాలమధ్య పెట్టుకొని పీల్చి పిప్పిని చేసారు. తెల్లవారు ఎందరో భరతవీరుల రక్తాన్ని త్రాగారు. ఇక్కడ రైతులు కష్టించి, శ్రమించి, చెమటోడ్చి పండించిన రత్నరాసులను ఓడలమీద తరలించి, యిక్కడి ప్రజలకు కనీసం గంజి త్రాగడానికికూడా లేకుండా చేసారు. ఈ రత్నగర్భలో లభ్యమైన మణిమాణిక్యాలను తమ దేశానికి గొనిపోయారు. భరతమాత కన్నీరు గార్చింది. తన నాదుకొనే వీరులే లేరాయని విలపించింది. ఆ విషాదకర పరిస్థితులను చూచి, స్వాభిమానంతో రక్తంపొంగి లక్షలాది దేశభక్తయువకులు కొదమ సింహాలవలె స్వాతంత్ర్య సంగ్రామంలో కుప్పించి దూకారు. 24 సంవత్సరాల యువకిశోరం 'భ గ త్ సి ం గ్' నవ్వుతూ ఉరి కంబాని కెక్కి ఉరిత్రాడును తగిలించుకొని 'వందేమాతరం' అంటూ నేలకొరిగాడు. వీరుడు చంద్రశేఖర్ ఆజాద్ బ్రిటీష్ దొరలను గడగడలాడించి, కుట్రతో బ్రిటీష్వారి తుపాకులకు బలైపోయాడు. వీరవనిత ఝాన్సిలక్ష్మిబాయి ఆంగ్లసేనానులను ముప్పతిప్పలుపెట్టి వీరస్వర్గ మలంకరించింది. లాలాలజపతిరాయ్, బిపిన్‌చంద్రపాలులు స్వాతంత్ర్య శంఖాన్ని పూరించి ప్రజానీకాన్ని మేల్కొల్పారు. బాలగంగాధర తిలక్ "స్వాతంత్ర్యం నా జన్మ హక్కు" అని సింహగర్జన చేసారు. వీరుడు నేతాజీ సుభాష్ చంద్రబోస్ "ఆజాద్ హింద్ ఫౌజ్"ను స్థాపించి బ్రిటీషువారిని హడలగొట్టాడు. అల్లూరి సీతారామరాజు లాంటి విప్లవవీరులు, తమ శౌర్య, బల పరాక్రమాదులను ప్రదర్శించి బ్రిటీష్వారిని వణికించారు. మహాత్మాగాంధీజీ తన చాకచక్యంతో అహింసాయుధాన్ని చేబూని ప్రజానీకాన్ని ఒక త్రాటిమీద న డి పి ం చి బ్రహ్మాండమైన మహోద్యమాన్ని నిర్మించి బ్రిటీష్వారిని హడలకొట్టారు. సర్దార్ పటేల్ "బార్డోలి సత్యాగ్రహము"ను నడిపి తెల్ల దొరలకు సింహస్వప్నమయినాడు. టంగుటూరి ప్రకాశం నన్ను కాల్చండని ఎదురురొమ్ము చూపిస్తూ ధైర్యంగా వేలాదిమంది ప్రజానీకంతో మద్రాసు నగరవీధులలో తెల్ల వారి తుపాకిగుండ్లకు ఎదురుగా నడిచాడు. వేలాదిమంది భరతవీరులు సంవత్సరాల తరబడి బ్రిటీషువారి కారాగారాలలో మ్రగ్గిపోయారు, వారి తుపాకిగుండ్లకు బలైపోయారు. చిట్ట చివరికి ఎట్టకేలకు భరతవీరుల త్యాగం ఫలించింది. రవి అస్తమించని బ్రిటీషు సామ్రాజ్యం పటాపంచలైంది. కూకటివ్రేళ్ళతో పెకలించి వేయబడింది. మహాత్మాజీ ఆశించిన సంపూర్ణ స్వాతంత్ర్యం మాత్రం లభించలేదు. ఖండిత భరతభూమి మాత్రమే మనకు దక్కింది. బ్రిటీషు వారి కుట్రతో భారతదేశం మూడు చెక్కలైంది. 1947 ఆగస్టు 14-15 అర్ధరాత్రివేళ భారతదేశం స్వతంత్రమైంది. భారతదేశం రెండుగా విభజించబడింది. ఒకే ఉపఖండంలో భారత్, పాకిస్థాన్‌లు వెలిసాయి. భరతమాత రెండు చేతులు ఖండించబడ్డాయి.

## మారణహోమం

ఆనాడు లక్షలాదిమంది నిర్భాగ్యులు తమ ఇండ్లనూ, వాకిళ్ళను వదలి కట్టుగుడ్డలతో విలపిస్తూ భారతదేశానికి

చేరారు. రక్తం ఏరులై పారింది. మారణహోమం జరిగింది. భర్తను కోల్పోయి అనాథలైన భార్యలు, కొడుకులను, కుమార్తెలను కోల్పోయిన నిర్భాగ్యులైన తల్లిదండ్రులు, భార్యలు దూరమైన భర్తలు ఎందరో అభాగ్యులు భారత భూమికి చేరారు. ఆ కాందిశీకులను ఆప్యాయతతో ఆదరించాం. ఒకప్రక్క కాందిశీకుల కన్నీటిధారలు, మరొక ప్రక్క స్వాతంత్ర్యదినోత్సవ సరంరంభాలు, ఒక చంప తల్లిదండ్రులను కోల్పోయిన అనాథబాలల ఆర్తనాదాలు, మరొక చంప స్వాతంత్ర్యదినోత్సవ ఆనందోత్సవాలు, ఒకవైపు పసుపు కుంకుమలు కోల్పోయిన అనాథ అభాగ్యుల రోదనలు, మరొకవైపు వందలాది సంవత్సరాల తరువాత దేశానికి స్వాతంత్ర్యం లభించినందుకు ఆనందబాష్పాలు. 1947 ఆగస్టు 15వ తేదీన ఈ విధంగా స్వాతంత్ర్యదినోత్సవం మనం జరుపుకున్నాం.

మన నాయకులు ఎన్నో వత్సరాలుగా కనిన బంగారుకలలు భయంకర దుస్స్వప్నంగా మారిపోతూ వుంది. బ్రిటీషువారి కుట్రల ఫలితంగానూ, మననాయకుల తొందరపాటుతనం వలననూ, భారతదేశం ఖండించబడింది. ఈ విషాదాంత నాటకంలోని చరమాంకంలో, అంతకు పూర్వం మన నాయకులుచేసిన వాగ్దానాలను కలిపి పరిశీలిస్తే ఈ దుస్థితికి మూలకారణాలు ఏమిటో ? మూలపురుషులు ఎవరో ? మన కవగతమవుతుంది.

## నెహ్రూ వాగ్దానం

1929-30లో లాహోర్‌లో జరిగిన భారత జాతీయ కాంగ్రెస్ మహాసభలు పండితనెహ్రూ అధ్యక్షతన జరిగాయి. డిశంబరు 31 అర్ధరాత్రి ఆయన దేశప్రజల చేత సంపూర్ణ స్వరాజ్యం సాధిస్తామన్న ప్రమాణం చేయించారు. ఆనాడు రావినది పవిత్రజలాలు ఆ లక్ష్యానికి అంకితమైన ఆ ఘట్టానికి సాక్షీభూతమయ్యాయి. అయితే పండితనెహ్రూ అధినేతయైన స్వతంత్ర్య భారతంలో ఆ నదికే స్థానం లేకుండాపోయింది. జాతిచేసిన ప్రమాణంపై ముద్రవేసిన "లాహోర్" మహానగరం భరతమాత బిడ్డలకు పరాయి నగరమైపోయింది. స్వాతంత్ర్యం అసమగ్రమైంది. స్వేచ్ఛా భారతరూపం వికృతమైంది. ముస్లింలీగు పాకిస్థాన్ నినాదం యిచ్చినప్పుడు "అర్థంలేని అభూత కల్పన" అని కొట్టివేసిన పండిత నెహ్రూ ఖండిత భారతావనికి ప్రధాని అయినాడు.

## ఇవ్వాళ దేశం!

**తిరునగరి**

వేటకాణ్ణి చూసిన పావురాయిలా
దౌర్జన్యానికి వణికిపోతోన్న దేశం
కొంప మునుగుతున్నా నిద్రించే కుంభకర్ణుడిలా
ఇదంతా ఏమీ పట్టని ప్రజానీకం
ఎవరింట్లోనో ఏదో జరిగితే ఎందుకు మనకీశ్రమ
అనుకుంటూ తలుపులు బిగించుకునే వింత
మన స్తత్వం
అయ్యో ! ఎంతటి విపత్కర పరిస్థితి
నెదుర్కొంటున్నాం
కాకూడదు మన మహోదయ స్వప్నం మరీచక
మనిషి మనిషి గుండెలో వెలిగితే మానవతాదీపం
మానవాళికి సుఖాల్ని తెస్తుంది తప్పక భవిష్యం
మనిషిని దైవత్వంలోకి మళ్ళించేదే మతం
కాకుంటె అది రాక్షసుల పైశాచిక దుర్మతం
సంకుచితత్వాల సరిహద్దుల్ని చెరిపేస్తేనే జాతికి
ప్రగతి
సమైక్యంగా సౌజన్యంతో జనం మసగలిగిననాడే
దేశానికి సుగతి.

## గాంధీజీ ఆవేదన

1940లో ముస్లింలీగు పాకిస్థాన్ తీర్మానం ఆమోదించింది. ఆ కోరికపై మహాత్మాగాంధీజీ "హరిజన్"

పత్రిక అనేక సంచికలలో తన భావాలను స్పష్టంగా వ్యక్త పరిచారు. "ద్విజాతి సిద్ధాంతం అసత్యమైనది. విభజన స్పష్టంగా అసత్యమే. అటువంటి సిద్ధాంతానికి అంగీక రించడం నాకు భగవంతుని నిరాకరించడంలాంటిది. భారత్‌ను రెండుగా చీల్చడం అరాజకంకన్నా దారుణ మైనది. అది సహించరాని జీవచ్ఛేదం. దేశాన్ని జీవచ్ఛే దం చేసేముందు నన్ను జీవచ్ఛేదం చేయండి. హిందూ స్థానంపై రెండు శతాబ్దాలు పరిపాలించిన మొగలులు కూడా చేయనిది మీరుచేస్తున్నారు"అని పలికిన నిప్పురవ్వలలాంటి గాంధీజీ మాటలు సహితం లెక్కచేయలేదు. ఆయన కళ్ళ ముందే భారతమాత విచ్ఛేదమనే దారుణం జరిగిపోయింది.

## డా. రాజేంద్రప్రసాద్

ఖండిత భారతావని ప్రప్రథమ అధ్యక్షుడు డా. రాజేంద్ర ప్రసాద్ 1945లో కారాగారంలో ఉన్న రోజులలో "ఇండియా డివైడెడ్" అనే గొప్ప గ్రంథం వ్రాసారు. దానిలో ఆయన విభజన విషయమై హేతుబద్ధంగా విశ్లేషించి, భౌగోళికంగా, చారిత్రకంగా, సాంఘికంగా, రక్షణపరంగా ఏ కోణంలో వాదించినా విభజన ఏమాత్రం ఆచరణీయంకాదని, క్షేమంకాదని సహేతుకంగా రుజువు చేసారు. కానీ ఆయన కాగితాలపై సిరా ఆరిందోలేదో ఆచరణీయంకానిది, అసాధ్యమైనది రూపం దాల్చింది. ఆ మహాగ్రంథం రచయితే ఖండిత భారత రిపబ్లిక్ ప్రథమాధ్యక్షుడయ్యారు.

## కాంగ్రెసు తీర్మానం

1942లో అలహాబాద్ సమావేశంలో పండిత జగత్ నారాయణ్ ప్రతిపాదించిన ప్రసిద్ధ అఖండ హిందూస్థాన్ తీర్మానం కాంగ్రెస్ ఆమోదించడం జరిగింది. ఏ రూపంలో నయినా, ఏ పద్ధతిలోనైనా విభజనకి తన పూర్తి వ్యతిరేకతను కాంగ్రెసు పునరుద్ఘాటించింది.

## లార్డ్ మౌంట్‌బాటెన్ పథకం

నాయకులు ఇన్ని వాగ్దానాలు చేసిన తరువాత కాంగ్రెసు విభజనకు లొంగిపోతుందని ఎవరూ ఊహించలేదు. లార్డ్ మౌంట్‌బాటెన్ 1947 సం. జూన్ 3వ తేదీన అధికారం బదలాయించేందుకు ఒక పథకం ప్రకటించడం ప్రజలకు అశనిపాతంలా అయింది. ఎందుకంటే నెహ్రూ, పటేల్‌లు ఆమోదించిన ఆ పథకం ప్రకారం భారతావని రెండుగా ఖండించి పాకిస్తాన్ నిర్మాణం జరిగితీరవలసిందే. జూన్ 15న అఖిలభారత కాంగ్రెస్ కమిటీ విభజన పథకంపైన తన ఆమోదముద్రవేసి లోగడ ప్రజలకిచ్చిన వాగ్దానాలను గాలిలో వదిలివేసింది.

## చితికిపోయింది

1947 ఆగస్టు 14-15 అర్థరాత్రి భారతావని ఖండించబడింది. జాతి విశ్వాసాన్ని దారుణంగా దగాచేయబడింది "అఖండ భారత్" అన్న భవ్యరూపం తమగుండెల్లో నింపుకొని స్వేచ్ఛా సమరపు అగ్నిజ్వాలలో దుమికిన ఎందరో అమరవీరులు కనిన కలలు భగ్నమైనాయి. భరతమాత సంపూర్ణ సమగ్ర చిత్రం చింపివేయబడింది. అమరవీరుల కనిన కలలకు ద్రోహం జరిగిందని గాంధీజీయే పెన బాధతో, వికలమైపోతున్న గుండెతో ఇది స్వయంగా ఒప్పుకున్నారు. పాకిస్థాన్‌కు రాయబారిగా పోతున్న శ్రీప్రకాశ్ గాంధీజీని కలువగా "నా జీవిత స్వప్నం చితికిపోయింది నా జీవితాశయం మట్టిపాలైంది. అర్థశతాబ్దపు ప్రయత్నం వృథా అయిపోయింది. ఇక రేగేమంటలూ, పారేనెత్తురు చేల్లే నా కళ్ళముందాడుతున్నాయి." అని గాంధీజీ ఆక్రోశించారు.

## కారణాలు ? కారకులు ?

జాతీయ మహానాయకులు తమ వాగ్దానాలను నిలబెట్టుకోలేకపోయారు. భారతదేశపు ఏకత్వమును సాధించుకోలేకపోయారు. దీనికి కారణాలు ఏమిటి ? కారకులెవరు ? పరిశీలించవలసిన అవసరం ఎంతైనా వున్నది. "కాళరాత్రి" (దేశ విభజన విషాదగాథ) గ్రంథం చదువుతే అర్థమవుతుంది. దీని రచయిత శ్రీ హెచ్. వి. శేషాద్రి. అనేక వివరాలతో ఈ గ్రంథం వ్రాయబడింది. ప్రతి దేశభక్తుడు చదువదగ్గ మంచి గ్రంథం. ప్రతులకు-సాహిత్యనికేతన్, బర్కత్‌పూర, హైద్రాబాద్, 500 027; సాహిత్యనికేతన్, ఏలూర్‌రోడ్ విజయవాడ 520002. ★

బయట వాన యింకా జోరుగా కురుస్తోంది.

గాలి లేదుకానీ, ఎడతెరిపి లేకుండా కురుస్తున్నందువలన నీళ్ళచప్పుడు మాత్రం వినిపిస్తోంది. వాతావరణం కొంచెం చలిగా వుంది.

అసలు ప్రొద్దున్నే ముసురు పట్టింది. నిన్న రాత్రి కూడా యింత వాన వస్తుందన్న సూచన లేవీ కనబడలేదు. నేను బ్యాంక్‌కి వచ్చేటప్పటికి పెద్ద వాన ప్రారంభమయ్యింది. అది అలా ఆగకుండా కురుస్తూనేవుంది.

చలిగావుందని, ఫేన్ వేయకుండా, లైట్‌వేసి తలుపేసుకుని నా రూమ్‌లో కూర్చున్నాను. ఇందాకే కిటికీలు మూస్తూ, కొంచెమైనా గాలిరావాలని ఒకరెక్క మాత్రం ఓరగావేసి వుంచాను.

టైమ్ పదకొండు గంటలయ్యింది.

యీ వానలో ఎందుకులే! అని కాబోలు పెదరెడ్డి రాలేదింకా.

ఇంతవరకూ ఏ పనీలేదు. చూసిన పేపరు తిరిగిచూస్తూ కూర్చున్నాను. నేనీ వూరికి వచ్చినప్పటినుంచీ యింతే. పెద్దగా పని ఏమీ వుండదు.

మా బేంక్ నన్ను మేనేజర్‌గా ప్రమోట్‌చేసి, యీ వూరి బ్రాంచ్‌కి పంపింది. మేనేజ్‌మెంట్ నాకిచ్చిన అధికారాల్లో తక్కువ వడ్డీకి లోన్స్ శాంక్షన్ చేయడం ఒకటి. ఎవరికి అప్పు యివ్వచ్చు, ఎవరికి యివ్వనక్కరలేదు అని నేనే నిర్ణయించవచ్చు. నన్నడిగే వాడెవడూ లేడు.

బేంక్ వుండేది ఒక చిన్న యింట్లో. ఊరి మధ్యలో వుందాయిల్లు.

నాయిల్లు వూరికి దూరంగా వుంటుంది. నేను సైకిలేసుకుని, రోజూ బేంక్‌కి వెళ్ళి వస్తూంటాను. నేను యింకా బ్రహ్మచారిని.

రోజూ మధ్యాహ్నం పన్నెండు గంటలకి బేంక్ మూసేసాం.




ఆ వూర్లో పెదరెడ్డికి నాయిల్లు దాటాక పొలాలున్నాయి. రోజూ పదకొండు గంటలకి తన యింటినుండి బేంక్‌కి వచ్చి, నాతో మాట్లాడుతూ కూర్చునేవాడు. నాకూ అంతగా పనిఏదీ లేకపోవడం వలన సరదాగా కాలక్షేపం చేసేవాడిని. అలా మా స్నేహం బాగా ముదిరింది.

బేంక్ మూసేసాక యిద్దరం సైకిళ్ళేసుకుని బయల్దేరే వాళ్ళం. అతను పొలాలు చూసుకోడానికి వెళ్ళేవాడు, నేను యిల్లు చేరుకునేవాడిని. పెదరెడ్డి సాయంత్రం తిరిగి వెళ్ళేటప్పుడు మా ఇంటికి వచ్చేవాడు. ఇద్దరం కలిసి పెద రెడ్డి యింటికెళ్ళే వాళ్ళం. నలుగురయిదుగురు కూర్చుని, పేకాట, త్రాగుడు జరిగేది. ఏ రాత్రో మైకంలోనే సైకిల్ మీద నా యింటికి చేరేవాడిని. నాకు ఎటువంటి పరిస్థితి లోనూ, ఒంటరిగా, నా గదిలో పడుకోవడమే అలవాటు. లేకపోతే అవస్థపడిపోతాను.

ఒకసారి పెదరెడ్డి ఎద్దులు జబ్బుచేసి పోయినప్పుడు, నేను ఎద్దులు కొనడానికి, లోన్ యిప్పిచ్చాను, లోన్ పేద రైతులకే, వృత్తిపనుల వాళ్ళకి మాత్రమే యివ్వాలి అనీ, చిన్న చిన్న వ్యాపారాలకి పెట్టుబడిగాయివ్వాలనీ కండిషన్స్ వున్నా. అయినా చెప్పానుగా, నన్నడిగే వాడెవడూలేడు. ఇంతదూరం హెడ్ఆఫీస్‌నుంచి వచ్చి చూసేవాడూలేడు.

అదీగాక, ఇందులో నాకు నష్టం తప్ప, మా బేంక్‌కి అప్పు తీరదు, నష్టం వస్తుంది అన్న సమస్యకూడా లేదు. ఎందుకంటే పెదరెడ్డి బాగావున్నవాడు. అప్పు సులువుగా తీర్చేయగలడు.

ఇంక నాకు నష్టం ఎలాగ అంటే, ఏ లోన్ యిచ్చి నప్పుడైనా, మొత్తంలో పదిశాతం నాకు యిచ్చే యాలి. లేకపోతే అప్పు శాంక్షన్ అవదు !

నేనెప్పుడూ డైరెక్టుగా లంచాలు తీసుకోను. అంతా అక్కౌంటెంట్ స్వామి చూసుకుంటాడు. అతను కొట్టే సేది టూ పర్సెంట్ !

పెదరెడ్డి స్నేహితుడు కాబట్టి మామధ్య యీ విషయం మరుగైంది. స్వామికి మా స్నేహం విషయం తెలుసు గనక నోర్మూసుకున్నాడు.

ఇద్దరి షేర్ పోయింది.

కాని, నాకప్పుడప్పుడు మంచి సరుకు మందు దొరుకు తుంది కాబట్టి అంత నష్టం లేదనిపించింది. తేరగా ఫారిన్ లిక్కర్ ఈ వూళ్లో దొరకడం, అదీ దాదాపు, ప్రతిరోజూ దొరకడం ఒకవిధంగా నాకు లాభమే అనిపిం చింది. స్వామికి అప్పుడప్పుడు బియ్యపు మూటో, బస్తానో పెదరెడ్డి దగ్గరనుండి యింటికి వెళుతుంది. అందు కని అతను అంతగా బాధపడలేదు.

అలా మాలోమేము ఒకరికొకరు సహకరించు కుంటున్నాం.

పేపర్ పూర్తిగా చూశాను. బయట యింకా వాన కురుస్తోంది. టైమ్ పదకొండూ ఇరవై అయ్యింది. బోర్‌కొడుతోంది. లేచి పచార్లు చేద్దామని కిటికీదాకా వచ్చాను. బయట తగ్గుస్వరంలో మాటలు వినబడ్డాయి. దగ్గరకు వెళ్ళాను.

అక్కౌంటెంటు స్వామి అంటున్నాడు, "చూడు, చల మయ్యా నీకు తెలియని విషయమేం కాదు. అయనకి వెయ్యి, నాకు ఒక రెండొందలు మాత్రమే. ఈ మాత్రం పుట్టించలేవా నువ్వు? నువ్వు ఘుందిచ్చేయ్. నీకు పది వేల రూపాయలు ఎంత తొందరగా వస్తాయో చూడు!"

"అయ్యా స్వామిగారూ, ఆ పన్నెండొందలు ఎలా గండీ పుట్టించేది? తొందరగా నేను డబ్బు తీసుకెళ్ళక పోతే బేరం పోతుంది. నాదగ్గర కొంచెంకూడా లేవే! ఎల్లుండికి డబ్బు యివ్వకపోతే, ఆ పశువులు అమ్మడు పోతాయి. బాబ్బాబూ, కొంచెం చూసిపెట్టండి. అప్లికే షన్ పెట్టుకుని ఎన్నిరోజులయ్యాయి. ఎల్లుండి బాబూ, ఎల్లుండి డబ్బు కట్టేయడానికి ఆఖరిరోజు. అందుకే వానలోపడి వచ్చాను. ఆ వూరి కెళ్ళడానికి బండిలో ఒక రోజయిపోతుంది. రేపయినా బయల్దేరాలి! మీరు దయ చూడాలి బాబూ. ఎంత త్వరగా అప్పు యిప్పిస్తే అంత ఋణపడి వుంటానండీ. కొంచెం చూసి పెట్టండి సార్" చలమయ్య బ్రతిమాలుతున్నాడు.

ఇంతలో "మేనేజర్ వున్నారా ?" అంటూ పెదరెడ్డి వచ్చాడు. వాళ్ళ సంభాషణ ఆగిపోయింది.

పెదరెడ్డి నా రూమ్‌లోకి వచ్చాడు.

"ఇంత వానగావుంది. ఇప్పుడింక వానలో యింటికేం వెళ్తారు ? మా యింటికి తీసుకుపోదామని వచ్చాను. ఏకంగా రాత్రికే వెళ్ళవచ్చులెండి. ఎలాగూ, మీరు మా యింట్లో పడుక్కోరు." అంటూ కూర్చున్నాడు పెదరెడ్డి.

ఇద్దరం కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నాం.

కొంతసేపయ్యాక వాన తగ్గింది.

మేమిద్దరం పెదరెడ్డి యింటికి వెళ్ళాం.

* * * * *

పెదరెడ్డి యింట్లో విందు, మందు, పేకాట వీటిజోరులో అలా యిలా చాలారాత్రి అయిపోయింది. నేను బాగా త్రాగివున్నాను. మత్తులోవున్నా సైకిలెక్కి యింటికి బయల్దేరాను.

నేను బయల్దేరేటప్పుడు వానలేదు. అంతా చీకటిగా వుంది. మట్టిరోడ్లు తడిసి బురదగావున్నాయి. అందుకని స్లోగా సైకిల్ త్రొక్కుతూ, అలవాటైన దారే కదా అని, ఆలోచిస్తూ వెళ్తున్నాను.

చలమయ్య గుర్తుకొచ్చాడు. అతనో పేదరైతు. ఆవులు, గేదెలు కొనుక్కుంటానని, అప్పుయివ్వమని, బేంక్‌కి అప్లికేషన్ పెట్టినట్లు గుర్తు. యిప్పుడు అర్జెంట్‌గా కొనకపోతే బేరం చేసుకున్న పశువులు వేరే ఎవరికో అమ్మడు పోతాయి కాబోలు ! అర్జెంటని మా వాటా యివ్వకుండా లోన్ తీసుకుంటాడా ! ఇంత సులభంగా లాగేద్దామనే ! స్వామి తేరగావస్తే పై సాకూడా వదలడు. అతన్ని బతిమాలడం వలన ప్రయోజనంలేదు. పోనీ పాపం పేదవాడని లోన్ శాంక్షన్‌చేసి, అందులోంచి కాజేస్తే ? బాగానేవుండే. ఇలా చేస్తే ఏం ? ఆ టైమ్‌లో బేంక్‌లో ఎవరూ లేకపోతే చెయ్యొచ్చు !

ఆలోచిస్తూ వెళ్తున్న నేను దారితప్పాను. ఎటువచ్చానో తెలీటంలేదు. నేల అంతా బురదగావుంది. హఠాత్తుగా సైకిల్ కదలలేదు. పంక్చరయ్యింది. సైకిల్ దిగాను. దూరంగా దీపం వెలుగు కన్పిస్తోంది. ఏదో గుడిశె. సరే, ఆ మనుషులెవరో దారి అడుగుదామని అటు తిరిగాను.

## పటారంకన్నా ప్రతిభేమిన్న

ఈరోజులలో సాధారణంగా మనుష్యులు సాధిం చేది స్వల్పమైనా అట్టహాసం మాత్రం జాస్తి. పని తక్కువైనా ఉపకరణాలమీద మోజు అధికం. ఒకప్పుడు బొంబాయిలో 'రాష్ట్రమాత' పత్రిక ప్రారంభింపుతున్నారు బల్లలూ, కుర్చీలు, బీరువాలు, ఫ్యానులు అత్యవసరమని నిర్వాహకులు Estimation వేస్తున్నారు. అప్పుడు కాకతాళీయంగా ఆసమయానికి అక్కడికి వచ్చిన లోకమాన్య బాలగంగాధరతిలక్ వారి సంభాషణలు విని "మేము కేసరి, మరాఠా పత్రికలు ప్రారంభించినపుడు ఇలాంటి సరంజామా ఏదీ మా దగ్గర లేదు. మీరు యిప్పుడు అవసరమని భావింపబడే ఉపకరణాలు ఏవీలేవు. పరుపు చుట్టనుచుట్టి, దానినే బల్లగా చేసుకొని రచనలు సాగించాం. అలా వ్రాసినప్పటికి, ఆ రచనలు ప్రజలలో ఉత్సుకతను, స్ఫూర్తిని కలిగించాయి" అని అన్నారు. అక్కడి వారందరూ బదులు చెప్పలేక మెదలకుండా వుండిపోయారు.

మహనీయులకు బాహ్య ఉపకరణాలతో నిమిత్తం లేదు. ఆడంబరాలకు ప్రాధాన్యత యివ్వకుండా, కార్యాన్ని సాధించడమే వారి జీవితలక్ష్యం. ఇప్పటివారికా ! పనిచేయడం తక్కువ — అట్టహాసం ఎక్కువ. పటారంకన్నా ప్రతిభేమిన్న.

ఇంతలో పున్నట్టుండి పెద్దవాన ప్రారంభమయింది. బాగా తడిసిపోయాను.

సైకిల్ స్టాండ్ వేసి, లాక్‌చేసి, ఆ గుడిశెవైపు నడిచాను. అంతా బురదమయం. చెప్పులు చేతిలో పట్టుకుని, పరిగెత్తితే పడతానని, జాగ్రత్తగా అడుగులువేస్తూ వెళ్ళాను. వానకి తడిసి ముద్దయిపోయాను. నా మైకం పూర్తిగా వదిలిపోయింది.

ఆ గుడిశె లోపల ఎవరో మొగుడూ, పెళ్ళాం ఒక నులక మంచంమీద కూర్చునివున్నారు. నన్ను చూసి అతనన్నాడు, "ఎవరు బాబూ? ఇట్లాగొచ్చారు! బాగా తడిసినారే!"

"వూరినుంచి వస్తూ దారి తప్పాను. యీ వాన తగ్గేలా లేదు. నా సైకిల్ పంక్చరయ్యింది. కాస్సేపు యిక్కడ కూర్చోనా" అన్నాను. నేనెవరో చెప్పలేదు.

"భలేవారే బాబూ! కూర్చోండి. వాన తగ్గినా చీకట్లో ఎట్లా పెళ్తారు. యింకో మంచంవుంది, కావాలంటే పడుకోండి. తెల్లవారితే వెళ్ళిపోవచ్చు" అందామె. ఇంకో నులకమంచము గోడకాన్చివుంది. అతను మంచమువాల్చి నన్ను కూర్చోమన్నాడు. నేను కూర్చుని సిగరెట్ వెలిగించి, వానలోకి చూస్తున్నాను.

ఆ మొగుడూ, పెళ్ళాలిద్దరు గుసగుస లాడుకుంటున్నారు. నాకు వాళ్ళ మాటలు వినిపిస్తూనేవున్నాయి.

ఆమె అంటోంది. "మన పెళ్ళి చేసింది మీ అన్నే, యింకా గుడిసె ఏసుకోడానికి సాయం చేసిందీ మీయన్నే. అటువంటి మనిషికి యీనాడు కష్టొస్తే, మనం కాదా సేయాల్సింది! ఆ డబ్బుగానివస్తే పశువులు కొనడా? మన డబ్బు ఏనాడో తిరిగి యిచ్చేయడా? నా గాజులూ మెళ్ళో తాడూ బంగారం కాదా, సెట్టికిచ్చేసి, డబ్బు తీసుకుని, మీ అన్న కిచ్చేసిరా. వూరికేనే ఎట్లా డబ్బు తెచ్చేది, ఎట్లా డబ్బు యిచ్చేది తోచట్లేదు, అని కూర్చోకు".

అతనంటున్నాడు, "ఓసీ! నిజమేనేవ్. ఎంత బాగా సెప్పావే! బంగారంలాంటి మాటలు సెప్పావు. అసలు నువ్వే బంగారానివే"

"అట్లాగని నన్నూ సెట్టి కిచ్చేస్తావేంటి కొంపతీసి" అందామె నవ్వుతూ.

"హోసి! నువ్వున్నావే! ఏం మాట్లాడుతావే!" అన్నాడతను గలగలా నవ్వుతూ.

నాకూ నవ్వొచ్చింది. నవ్వాపుకుంటూ, అయిపోయిన సిగరెట్ వానలోకి విసిరాను. వాన తగ్గలేదు.

పేదవాళ్ళలో అభిమానాలు, విశ్వాసం, మానవత్వం, సహాయగుణం, అమాయకత్వం, మంచితనం, వీటి గురించి ఆలోచిస్తూ, నాకు తెలీకుండా, తడిబట్టలతో, నా అలవాటుకి విరుద్ధంగా క్రొత్తచోట, నిద్రలోకి జారి పోయాను.

* * * * *

నాకు మెలకువ వచ్చేటప్పటికి తొమ్మిదయింది. గుడిశెలో ఎవ్వరూలేరు. బయటకి వచ్చాను. ఎదురుగుండా నా సైకిల్ కనిపించింది। గుడిశె వెనకాల ఏవో చప్పుళ్ళు వినిపించాయి. అటుపేపు వెళ్ళాను. ఆమె పాత్రలు కడుగుతోంది.

నన్ను చూసి, "లేచినారా బాబు, సైకిల్ పంచరేయించి పెట్టి, తిరిగి వూరికి పోయినాడు. మీకు సెప్పమన్నాడు మావ" అంది.

వాళ్ళ మంచితనానికి నా మనస్సు పొంగిపోయింది.

"ఇదిగో ఇది తీసుకో" అని పదిరూపాయల నోటు యిచ్చి నేను బయల్దేరాను.

మట్టిరోడ్డు ప్రక్కగా, పొలంగట్టు దగ్గర వుందాగుడిశె. కొంచెం దూరం వెళ్ళాక నాకు సరియైన దారి తెలిసింది. వానలేదుగానీ, ముసురు బాగా పట్టింది. నేను నా యింటికి చేరి రెడీ అయ్యి బేంక్ కెళ్ళేటప్పటికి లేటయ్యింది. మళ్ళీ పెద్దవాన ప్రారంభమయ్యింది.

నా గదిలో కూర్చున్నాను. బేంక్‌కి ఎవరో వచ్చారు. మాటలు వినబడుతున్నాయి.

"మేనేజర్‌గారు వచ్చేసారాండీ?" చలమయ్య అక్కౌంటెంట్ స్వామిని అడుగుతున్నాడు.

స్వామి సీట్లోంచి లేచి, "పద నీతో మాట్లాడాలి" అని బయటకి తీసుకువచ్చాడు.

ఇద్దరూ నా గది కిటికీ దగ్గర నిలబడ్డారు. నేను పైనున్న రెక్క ఒకటి మాత్రం తెరిచివుంచటం వలన

మనుషులు కన్పించకుండా, మాటలు మటుకూ వినిపిస్తు న్నాయి.

కుతూహలంతో దగ్గర కెళ్ళాను. లోనిచ్చి అందులోంచి లంచం తీసుకోడమా ? లేకపోతే డబ్బు తెచ్చాడా ? ఆసక్తితో వాళ్ళ మాటలు వింటున్నాను.

"తీసొకొచ్చావా ?" స్వామి అడుగుతున్నాడు మెల్లిగా.

"ఇంకా లేదండీ. మా తమ్ముడిని అడిగి తెస్తానని విన్న చెప్పాను కదా. ఇందాకవస్తే మీరూలేరు, మేనేజర్ గారూలేరు. దార్లో మా తమ్ముడిని కలిశాను. రాత్రి ఎవరో వాడి గుడిసెకి దారితప్పి వచ్చారంట. ఆయన సైకిల్ పంచరయితే, అది సరి చేయించి, మళ్ళీ సైకిల్ గుడిసె దగ్గరపెట్టి, ఇప్పుడే పెట్టె దగ్గర డబ్బు తేవడానికి వెళ్తున్నాడు. తొందరగా యిక్కడికే రమ్మని చెప్పి, మీరూ, మేనేజర్ గారూ, వచ్చేసి వుంటారేమోనని, నేను వచ్చేసాను" అంటున్నాడు తగ్గుస్వరంతో చలమయ్య.

"ఇదిగో చూడూ, ఇదేదో త్వరగా తేల్చకపోతే కష్ట పడేది నువ్వే" స్వామి కఠినంగా అన్నాడు.

"వాడ్ని రానీయండి. మీక్కావల్సింది మీకు పారేస్తా.... నా తమ్ముడొచ్చాక యిచ్చేస్తానండీ. కొంచెం సేపే...." ముందు స్వామి కంఠస్వరానికి అసహ్యంతో కోపంవచ్చి విసురుగా అనబోయి, అవసరం తనది కాబట్టి కొంచెం తగ్గినాన్నాడు చలమయ్య.

నాకంతా అర్థమైంది !

నాకు లంచం యివ్వడానికి నగలు అమ్మి డబ్బు తెస్తు న్నారు ! ఎందుకో నామీద నాకే అసహ్యమేసింది. నేను ధనవంతుడినే. అయినా కక్కుర్తితో పేదవాళ్ళ కడుపులు కొడుతున్నాను. ఇలా లంచాలువట్టి ఏం చేసుకుంటాను ? అప్రతిష్ట తప్ప ! కుక్కకి ఎంగిలి పారేసినట్లు మాకు పారేస్తాననబోయి ఆగిపోయాడు చలమయ్య !

ఎంత లోకువ ! అడిగేవాడు లేడు కదా అని సెల్ఫ్ డిసిప్లిన్ లేకుండా తప్పు చేస్తున్నాను. ఇదో అలవాటుగా మారిపోయింది. ఇంక మానేయాలి !

బెల్ కొట్టాను. ప్యూన్ వచ్చాడు.

"స్వామిని పిలు" అన్నాను.

"బయట వున్నారండీ పిలుస్తాను" అని వెళ్ళాడు.

స్వామి నా గదిలోకి వచ్చాడు.

"మాటలు వినబడ్డాయి. ఎవరది ? చలమయ్య కదూ ? లోన్ అప్లికేషన్ పెట్టాడు కదూ, ఏంటి సంగతి" అని అడిగాను.

"అదేనండీ, ఇతని దగ్గర లేదుట. తన తమ్ముడిస్తాడని చెప్పాడు. అతనిని రమ్మని చెప్పాడంట. ఇంకా రాలే దతను. మనకేం. లేదంటే కష్టపడేదతనే అని తెలియ జరుస్తున్నాను" వెకిలిగా నవ్వుతూ అన్నాడు స్వామి.

"స్వామీ, ఏదో శెట్టి అంటున్నాడు. బహుశః, నగలు తాకట్టుపెట్టో, అమ్మేతో తెస్తారేమో ? మరీ పేదవాళ్ళలా వున్నారు. మనంకూడా అడ్జస్టు చేసుకోవాలి అతన్ని వంపించు. శాంక్షన్ చేస్తా" అన్నాను. స్వామి మొదట తెల్లబోయాడు. ఇదేం మాయరోగం అన్నట్టు చూశాడు. కానీ, అతను వయసుమళ్ళినవాడు, లౌక్యం తెలిసినవాడు. ఏ ఎండకా గొడుగుపట్టే రకం ! సమయానికి తగినట్లు

"అవును సార్, మనమూ మనుషులమే కదా, కష్ట జీవులకూ, శ్రామికులకూ దయా దాక్షిణ్యం చూపాలి. అదే

నాకు నవ్వొచ్చింది. నా డ్యూటీ నేను చేయడం పరోప కారంలాగ మాట్లాడుతున్నాడు !

చలమయ్య లోపలికి రాగానే, వివరాలడిగి, లోన్ మా బేంక్ షరతుల ప్రకారం శాంక్షన్ చేశాను. క్యాష్ కౌంటరులో చదివేలు తీసుకోమన్నాను.

ధర్మప్రభువని మెచ్చుకుని వెళ్ళాడు.

ఆహా ! కీర్తి కూడానా ! అనుకున్నాను ఆలోచిస్తూ.

కొంతసేపయ్యాక బయట చలమయ్య గొంతు విన బడింది.

" ప్రజాసేవ పవిత్ర విధిగా, జీవిత పరమావధిగా భావించి, తమ సర్వస్వాన్ని సమర్పించి, తరించిన మహామహుల మహత్తర జీవితాలను మననం చేసుకొని ఉత్తేజితమైన జాతి కర్తవ్య నిర్వహణకు కంకణం కట్టుకోవాలి "

— చిత్తరంజన్‌దాస్

"ఏరా, ఇప్పుడే వచ్చావా? సెట్టి డబ్బిచ్చాడా? ఎట్లా గిచ్చాడు? అది ఎందుకు చెప్పవూ?"

రాత్రి నేను గుడిశెలో చూసిన మనిషి గొంతు వినబడింది.

"నువ్వు ముందే సెబితే ఒప్పుకోవన్నా, తిడతవ్. మన మంగ నగలుయిచ్చి డబ్బు తెచ్చా, అమ్మేయలేదులే, కంగారు పడకు_ఇదిగో డబ్బు".

"వద్దులే, రా పోదాం. ఆ నగలిప్పుడే విడిపించుదాం. ధర్మాత్ముడు! ఆ మేనేజర్‌గారి దయవలన యీ పన్నెండొందల అవసరమే లేకుండా పోయింది. ధర్మప్రభువు! ధర్మప్రభువు!" అన్నాడు చలమయ్య.

"అయితే రా, పోదాం. నగలు తిరిగిస్తే నీ మరదలు మనసు హాయిగా, తేలికగా వుంటుంది" అన్నాడతను. ఇద్దరూ వానలోనే గొడుగులు తెరిచి పట్టుకుని, వెళ్ళిపోయారు.

నా మనసూ హాయిగా తేలికగావుంది.

ఎంత అదృష్టవంతుడిని. చేతులు కాలాక ఆకులు పట్టుకుని ప్రయోజనంలేదు. ముందే రాబోయే ఎన్నో ప్రమాదాలను ఒక్క అనుభవంతో తప్పించుకున్నాను! ఇలా లంచాలు తీసుకుంటూనేవుంటే, హెడ్ ఆఫీస్‌లో తెలిస్తే, డిస్మిస్ చేస్తారు.

రేపు నాకు పెళ్ళయితే, నా పెళ్ళాం, పిల్లలు ఎంత అప్రతిష్ట, అవమానం భరించాల్సొచ్చేది! అందరూ ఎంత హీనంగా చూస్తారు!

ఇలాంటివి ఎన్నో తప్పించుకున్నాను కదా!

ఎప్పుడో సోక్రటీస్ చెప్పాడు, "నీవు ఎలాంటి అవమానానికి గురైనా, కోల్పోయిన పేరు ప్రతిష్ఠలను పునరుద్ధరించుకోగల శక్తి ఎల్లప్పుడూ నీ చేతిలోనే వుంటుంది".

ఎంత నిజం!

ఎంతో లోకువతో, తేలికగా "డబ్బు మొహాన పారేస్తా" అనబోయిన చలమయ్య "ధర్మప్రభుపు" అన్నాడు కదా!

ఒక ధృఢనిర్ణయానికి వచ్చాను.

ఇంకెప్పుడూ అధికారం దుర్వినియోగం చెయ్యను!

బయట వాన ఆగింది. కానీ, ముసురు తగ్గలేదు. అయితే, నా మనసుకి పట్టిన ముసురు మాత్రం విడిపోయింది.

నూతన తేజంతో నిండిపోయి వున్నాను నేను?

ఎంతో ఆనందంగా, వుత్సాహంగా వున్నాను.

చాలామంది యిప్పుడు నేనున్న స్థితి నమ్మకపోవచ్చు! స్వామిలాంటి వాళ్లు 'వెర్రి పీనుగ' అనుకోవచ్చు! కానీ నాకు తెలుసు. నాలాగే ఎందరో, చేతులు కాలకముందే తప్పించుకున్న అధికారులూ, తప్పుడు పనులు చేయబోయి కొంప మునగక ముందే సరిదిద్దుకున్న వ్యాపారస్తులూ, కాలు జారబోయి ప్రమాదంనుండి తప్పించుకున్న ఆడపిల్లలూ, ఇతరుల అనుభవంతో తమ జీవితాన్ని సరిదిద్దుకోగల బుద్ధిమంతులూ, నన్నూ, నా పరిస్థితిని అర్థం చేసుకోగలరు!

## వితాన్ని హసన్మందార మాలగా ధరించిన

# దేవరకొండ బాలగంగాధరతిలక్

బుచ్చిబాబు " చివరకు మిగిలేది " అనే ఒక నవలను వ్రాసి, తెలుగు పాఠకుని గుండెలో శాశ్వతంగా ఎలా నిలిచిపోయాడో, తిలక్ తన " అమృతం కురిసిన రాత్రి " అనే ఒకే ఒక కవితా సంకలనంతో తెలుగు సాహితీప్రియులందరి జ్ఞాపకాలలో ఇమిడిపోయాడు.

" అన్నా ! కవిత్వం అంతరాంతర జ్యోతిస్సీమల్ని బహిర్గతం చెయ్యాలి ! విస్తరించాలి చైతన్య పరిధి ! అగ్ని జల్లినా, అమృతం కురిసినా, అందం, ఆనందం దాని పరమావధి " అంటాడు తిలక్. అందుకే, ఆతని అక్షరాలు కన్నీటి జడులలో తడిసే దయాపారావతాలు ! ప్రజాశక్తుల వహించే విజయ ఐరావతాలు ! అంతేకాదు ! వెన్నెలలో ఆడుకునే అందమైన ఆడపిల్లలు కూడా !

అటు భావ కవితకు, ఇటు అభ్యుదయ కవితకూ సేతువుగా నిలిచినవాడు తిలక్. అందుకే " కవిత్వం ఒక ఆల్కెమీ ! దాని రహస్యం కవికే తెలుసును. కాళిదాసుకు తెలుసు, పెద్దన్నకి తెలుసు, కృష్ణశాస్త్రికి తెలుసు, శ్రీశ్రీకి తెలుసు " అంటాడు. కేవలం ఆ యా ప్రక్రియలకు హారతి పట్టడం మాత్రమే కాక, వాటిని తన ఆలోచనలోనూ, ఆచరణలోనూ కూడా మలచి చూపిన వాడు తిలక్. " నా మీద నీ చూపు చీకట్లు ముసురుకుని, నీ మీద నా రూపు వెన్నెలలు పరుచుకుని, నా కలల వెన్నెరుల అలలొక్కపరి పొంగి, నీ కనుల నాకాంక్ష నాసజ్యధనువులై వొంగి, నా గుండె నీ పాట బాడబమ్మై రేగి, నీ తనువు నా కౌగిలిని తటిద్గానమై సాగి " — ఇలా సాగిపోతుంది ఆతని భావ కవితా స్రవంతి ! అజ్ఞాతంగా తమలో దాగిన భయంలో, గతంలో కూరుకు పోయిన, గతించిన కాలపు నీడలలాంటి మనుష్యులను చూసి, " ధైర్యంలేని, తమ స్వభావాన్ని ధర్మమని పిలుస్తూ, బరువుగా బెదురుగా బ్రతుకుతున్న వీళ్ళమధ్య, డైనమైట్ పేలాలి, డైనమోలు తిరగాలి " అంటూ దూకుతుంది ఆతని హృదయాంతరాంతరాల నుంచి, అభ్యుదయ కవితా ఝరి !

## ఇదీ ఈనాటి పంథా

అందరూ అధైర్యంతోనూ, అస్వతంత్రతతోనూ ముడుచుకొని పడుకొని ఉంటే, తానొక్కడే ఇల్లు విడిచి, కొండదాటి, కోనదాటి, వెన్నెల మైదానంలోకి వెళ్ళి నిలబడి, అప్సరసలు కురిపించిన అమృతవర్షాన్ని దోసిళ్ళతో త్రాగి తిరిగివచ్చిన వాడు తిలక్. తను పొందిన ఈ అదృష్టాన్ని తనతోటి వాళ్ళు ఎందుకు పొందలేక పోయారని, అతనిలో అంతర్మధనం ఆరంభమయింది ! అంతే ! నీరంధ్ర వర్షాన వంతెన క్రింద ప్రసవించి మూర్ఛిల్లిన నిండు చూలాలు, తల్లి లేక తండ్రిలేక తిండి లేక ఏడుస్తూ మురికి కాలవ ప్రక్కన నిదురించిన మూడేళ్ళ పసిబాలుడు, పిల్లలకు గంజి కాచి పోసి, తాను నిరాహారుడై, రుద్ధ బాష్పాకులితనయనుడై ఆఫీసుకు వచ్చిన వృద్ధుడు ప్యూన్ వీరన్న—ఇలా ఎందరో ! ఆతని కనుల ముందు ప్రత్యక్షమయ్యారు. ఆ దృశ్యాల్ని చూసి, గుండె బరువెక్కి, " నాకు శాంతి కలగదింక నేస్తం, నేను నిగర్వినైనాను. ఈ సిగ్గులేని ముఖాన్ని చూపించలేను " అంటాడు.

మధ్య తరగతి జీవితం అంటే—" జామెట్రీ, కాలిక్యులస్, అక్కయ్యకి రెండో కానుపు, తమ్ముడికి

## మేడిపండు

నా గుడిసెలో
నవ్వే దివ్వెకి
ఎంత ఆరాటమో
గుడిసెకంతా వెలుగులు పంచాలని !
తనకు నిప్పు పెట్టుకుని
లోపల
విలవిల లాడుతూ
పైకి
కలకల నవ్వుతోంది ! !
నా దేశంలో
వెలిగే నాయకునికి
ఎంత పోరాటమో
దేశమంతా చీకటిని చిమ్మాలని !
తాను పదవినంటుకుని
లోపల
కిలకిల లాడుతూ
పైకి
వలవల ఏడుస్తున్నాడు ! ! !

— అనంత వేంకటేశన్

మోకాలి వాపు, చింతపండు ధర హెచ్చింది, చిన్నన్నకు మతిభ్రమ కలిగింది”—ఇంతేకదూ ! తిలక్‌కు తెలుసు— ‘ ఆశ ఉత్తర ధృవమనీ, విధి దక్షిణ ధృవమనీ, మనిషి రెండింటి మధ్య బంతిలా ఎగిరిపడే ప్రహసనమనీ ! ’ అంతేకాదు ! ‘ భూమి తన చుట్టూ తాను తిరుగుతూ, ధనవంతుడి చుట్టూ తిరుగుతోందనీ తెలుసు ’ ! అందుకే—

“ దరిద్రం సముద్రంలో వేదనల తెరచాపలెత్తి
ప్రయాణించే జీవన నౌకలకి, మృత్యువే లైట్
హౌస్ ” అంటాడు భారంగా !

అయితే తిలక్ ‘ ని ప్రేమించినవాడు ! జీవించడం తెలిసినవాడు. ’ అందుకని, “జీవితం నవనీతం పాత్రమీద చెదిరిపడనీయకు రాయినీ, రప్పనీ ! పగులుతుంది స్వప్నం ! రగుతులుంది దుఃఖం ! అందుకే బ్రతుకే ఉలిపిరి కాగితం చందం ! ” అంటాడు.

“ చీకటి నవ్విన వెలుతురా ! వాకిట వెలసిన వేకువ తులసివా ” అని ప్రాతఃకాలాన్ని పిలుస్తూ ప్రకృతి నారాధించినా, “ నీ వొంటిమీద చిరు గంధం సువాసన నా మనస్సుని చుట్టుకుంది ” అని శృంగార గీతం పాడినా, “ చివరకు చివరకు అక్కడికే అక్కడికే, అది జీవిత పరమసత్యం, అది నాగరికత గమ్యస్థానం, అది చరిత్రల సారాంశం ” అని జీవిత సారాన్ని ప్రబోధించినా, తిలక్ ప్రధానంగా మానవతావాది. అందుకే—“ మంచి గంధంలాగ పరిమళించే మానవత్వం, మాకున్న ఒకే ఒక అలంకారం ” అంటాడు. మరి అందుకే, “ మానవత లేని లోకాన్ని స్తుతించలేను. మానవునిగా శిరసెత్తుకు తిరగలేను. ఈ నాగరికతారణ్యవాసాన్ని భరించలేను ” అని వాపోతాడు.

కానీ తిలక్ అన్నట్లు, “ కొనరు కొంచెమైనా వెయ్యని, పిసినారి కోమటి దేవుడు, అసలు తూకంలోనే మోసం చేసి, ఆనందాన్ని, ఆయుఃప్రమాణాన్ని తగ్గిస్తాడు ”. అందుకే తిలక్ మన మధ్యనుండి అంతర్థానమయ్యాడు. తిలక్ జీవించి వుంటే మరెన్ని మంచి కవితలు వ్రాసేవాడో, ఎన్ని సందేశాలు అందించేవాడో తెలియదు.

అయితే, తిలకే ఒకచోట అంటాడు—“ ఈనాటికీ ఎవరికీ తెలియదు, నేను అమరుడనని. ” నిజంగానే తిలక్ అమరుడు !



# ఎగరలేని పక్షులు

డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు




పక్షి అనగానే ఎవరికైనా గుర్తువచ్చేది ఆకాశంలో అవిచేసే విహారం, వాటి రంగురంగుల ఈకలు, రకరకాల పాటలు. ఎగరటం అనేది ప్రకృతి పక్షులకు ప్రసాదించిన వరం. ఇంకా అనేక ఇతర రకాల జంతువులు గాలిలో ఎగురుతాయికాని అవేవి పక్షులకు సాటిరావు. కాని అన్ని పక్షుల ఎగురుడు ఒకలా వుండదు. ఎంతో చిన్న పక్షి అయినప్పటికి భూప్రదక్షణం చెయ్యగలిగినది టెర్న్ పక్షి (శ్రీవాణి, మార్చి '85) కొన్ని పక్షులు ఎంతో అవసరమైతే తప్పించి తమ రెక్కలను ఉపయోగించవు. ఉదాహరణకు మనకు నిత్యము కనిపించే కోడి, అరుదుగా కనిపించే నెమలి. మరి కొన్ని పక్షులు అసలు ఎగరనే ఎగరవు. ఉదా : కివిపక్షి. ఈ ఎగరలేని పక్షులు ప్రపంచంలోని కొన్ని ప్రాంతాలకు మాత్రమే పరిమితమై వుండటంవల్ల వీటి గురించి చాలా మందికి తెలియదు.

ఈ పక్షులకు ఎగిరేశక్తి ఎందుకులేదు! ఈ విషయం తెలుసుకోవాలంటే అసలు పక్షులకు ఎగిరేశక్తి ఎలా వచ్చిందో తెలుసుకోవాలి.

కొన్ని వేల లక్షల సంవత్సరాల క్రితం బల్లులు, తొండలకు సంబంధించిన జీవులనుండి పరిణామక్రమంలో పక్షులు ప్రకృతిలోకి వచ్చాయి. ఆ సమయంలోవున్న శత్రుజంతువులనుండి రక్షణ పొందటం కోసం ఇవి గాలిలోకి ఎగిరే ప్రయత్నం ఆరంభించాయి. మొదట ఎత్తయిన ప్రాంతంలోకి వెళ్ళి నెమ్మదిగా గాలిలో తేలుతూ కిందికి దిగ నారంభించాయి. ఈ జీవులు వేల సంవత్సరాల సాధనకు, ప్రకృతికూడా తోడవగా వాటి శరీరంలో కావాల్సిన మార్పులు వచ్చాయి. అవే ఈకలు, రెక్కలు. ఆ విధంగా ఎగిరే జంతువులు ప్రకృతిలోకి వచ్చాయి. వాటి నన్నింటిని కలిపి పక్షులన్నాం. మారుతున్న వాతావరణ పరిస్థితుల కనుగుణంగా పక్షుల శరీరంలో రకరకాల మార్పులు రావటంతో ప్రస్తుతం మనం చూస్తున్న రకరకాల పక్షి జాతులు ఏర్పడ్డాయి.

మొదట్లో ఎగిరే శక్తివున్నా క్రమంగా ఆ శక్తిని కోల్పోయినవే ఈ ఎగరలేని పక్షులు. ఇవి ముఖ్యంగా ఆస్ట్రేలియా ఖండ దేశాల్లో ఎక్కువగా కనిపిస్తాయి. బొమ్మలో కనిపించే కివి, కకాపో పక్షులు అక్కడివే. ఇక మూడవదైన ఆస్ట్రిచ్ ఆఫ్రికా ఖండంలోని కొన్ని దేశాల్లో మాత్రమే కనిపిస్తుంది.

భూమండలం ఏర్పడ్డప్పుడు ఆస్ట్రేలియా ఖండ ప్రాంతమంతా ఆసియా ఖండంతో కలిసివుండేది. ఆ తరువాత అది విడిపోయి ప్రయాణించేసి ఇప్పుడున్న చోటికి చేరింది. సరిగ్గా పక్షులు ప్రకృతిలోకి వస్తున్న సమయంలోనే ఆ ఖండం విడిపోవటం జరిగింది. అలా విడిపోయిన ఖండంమీదికి పక్షులు వెళ్ళాయికాని, పక్షికి శత్రువులైన పాములు కాని మరే ఇతర జంతువులు కాని వెళ్ళలేకపోయాయి. అంటే ఆ ఖండానికి పక్షులే "రాజు" లన్నమాట. శత్రువులు లేకపోవటంతో అక్కడికి చేరిన పక్షులకు ఎగరాల్సిన అవసరం లేకపోయింది. నేలమీద గుడ్లు పెట్టినా క్షేమంగా ఉంటున్నప్పుడు చెట్లెక్కాల్సిన అవసరం ఏముంది! అలా కొన్ని లక్షల సంవత్సరాలపాటు రెక్కలకు పని చెప్పక పోవటంతో ఆ రెక్కలు బలహీనపడి క్రమంగా ఎగిరే శక్తిని కోల్పోయాయి.

అదీ ఎగరలేని పక్షుల కథ. ఆ పక్షులలో ఒక్కొక్క దాని గురించి వివరంగా వచ్చే సంచికల్లో వివరిస్తాను. ●

కాగితం వేపే చూస్తూ ఉండిపోయాడు రామచంద్రమూర్తి.

సీరియల్ రాయడం - మధుమూర్తి చెబుతున్నంతసేపూ ఎంత సులభంగా అనిపించిందో... మొదలుపెట్టబోతే అంత కొరుకుడు పడకుండా ఉంది.

కథావస్తువేం తీసుకోవాలి ?

( "ఏం చెప్పారన్నది కాదు ప్రధానం. ఎలా చెప్పారన్నదే. నిజానికి ఏమీ చెప్పకపోతే మరీ మంచిది. ఎన్ని సీరియల్సైనా రాసుకుంటూ పోవచ్చు. ఒక నవలలో ఎక్కువ మేటరివ్వడం – తక్కువ డబ్బుకెక్కువ సరుకివ్వడమే అని మరువకండి." బ్రాకెట్లలోంచి చెప్పాడు మధుమూర్తి. ఇకనుంచీ యీ అధ్యాయంలో బ్రాకెట్లంటే మధుమూర్తి – అని గ్రహింతురు.)




నీతి దాయకమయిన వస్తువు....(వొద్దు. నీతి కథలకి కాలం చెల్లిపోయింది. పాఠ్యపుస్తకాలలో తప్ప నీతి కథలకు చోటులేదు. ఇప్పుడంతా అవినీతి కథలే హాట్ కేకులు).

ఛఛ....అలా ఎలా ? కథావస్తువుమీద నిర్బంధాలేమిటీ ?

మనకి నచ్చింది మనం రాస్తాం. (అక్కడే మీరు పొరబడుతున్నారు గురూజీ ! సేల్ అయ్యేది తయారుచేస్తే సులువు. తయారుచేశాం కదా అని సేల్ చెయ్యడం కష్టం. కబాబు పుల్లలు కావాలంటున్న వాళ్ళకి కలకండ అందించబోతే లాభముండదు. పాఠకులకు నచ్చింది రాయడమే నేటి రచయిత కర్తవ్యం.)

రామచంద్రమూర్తి తలపట్టుకున్నాడు రెండు చేతులతోనూ. అతని మెదడులోకి మధుమూర్తి ప్రవేశించి లెక్చరిచ్చేస్తున్నాడు. (సస్పెన్సు....థ్రిల్....యివే ముఖ్యం నేటి సీరియల్‌కి. సస్పెన్సంటేనా....? చుక్కలు. ఔను. వాక్యం మధ్యలో చుక్కలు పెట్టేసి—సశేషం అనేసి.... వాక్యంలోని రెండో భాగం వచ్చే వారం వెయ్యడమే సస్పెన్సు. ప్రతి అధ్యాయం చివరి వాక్యమూ క్రియ లేకుండా ఆగాలి ఆ వారం. ఉదా : అతను పిస్టల్‌ని చేతిలోకి తీసుకున్నాడు. తనవేపే వస్తున్న భార్యని చూశాడు. ఒకటి....ఆమె దగ్గరగా. రెండు....ఆమె యింకా దగ్గరగా....ట్రిగ్గర్ మీద వేలు.... (సశేషం)

తుపాకి పేలిందా లేదా అనేది వారంపాటు సస్పెన్సు.)

కాని ...తెలుగువాక్యం తెలుగు సంసారంలాంటిది. కర్త భర్త. కర్మ పిల్లలు....క్రియ-భార్య, క్రియలేని వాక్యం ఇల్లాలులేని యిల్లు. అలా విడదీయడం మహాపాపం.

( అదే చాదస్తం. భార్యాభర్తలు కలిసి ఉంటే ఏం థ్రిల్లు ? విడిపోయి—మళ్ళీ కలుసుకుంటేనే మజా. చిన్న చిన్న వియోగాలు దాంపత్య జీవితాని కత్యవసరాలని వాత్స్యాయనుడే వ్రాశాడు. అయినా — మిమ్మల్ని సంసారకథలు రాయొద్దన్నానుగా ? సంసారంలో థ్రిల్లుండదు. ప్రేమలో ఉంటుంది. క్షుద్ర ప్రేమలో ఉంటుంది. మరచిపోకండి, తెలుగు సీరియల్ మరియు నవలావనంలో ఎన్నటికీ వాడని ఏకైక పుష్పం ప్రేమ. క్షుద్ర ప్రేమ.

తెలుగులో యిప్పటికి ఒక లక్షా తొంభై రెండువేల మూడు వందల నలభై ఏడు ప్రేమ నవలలు వొచ్చాయి. ఇంకా రెండు లక్షల మూడువేల నూటపదకొండు ప్రేమనవలలకి ఖాళీ ఉంది.)

నిజమే కావొచ్చు. కాని....తీసుకునే కథావస్తువు కొత్తగా లేకపోతే — పాతకుడి మాట దేవుడెరుగు, రచయితకే ఉత్సాహంగా ఉండదే రాయడానికి? రాసిందే రాస్తూంటే-పాడిందే పాటరా పాసిపళ్ళ దాసరీ అనెయ్యరూ నలుగురూ?

(కొత్తదనమో అని బుర్ర బద్దలు కొట్టుకోవడం వొట్టి యిన్నోసెన్స్. అమాయకత్వం. తెలుగులో....ఇంగ్లీషులో....రోజుకి వందలకొద్దీ కథయా నవలలూ నాటకాలూ అవీ ఉత్పత్తయిపోతున్నాయి. సాహిత్యపు కర్మాగారాలకి సెలవుల్లేవు. లాకౌట్స్ లేవు. ఇందరిన్ని రాస్తూండగా కొత్తదన మెక్కడినుంచి వొస్తుంది? వాళ్ళందరికంటే విభిన్నంగా ఆలోచించెయ్యడానికి మీరూ మానవమాత్రులే. మీకు మరీ ఖాదస్తమయితే, యథాతథంగా అనువదించకండి. ఒకటో రెండో ఇంగ్లీషు నవలలు చదివి కొంచెం ఆలోచించినట్లు నటించి తెలుగు సీరియల్ మొదలు పెట్టండి. అంతేకాని నవలంటే కొత్తదనం కదా అని కొత్త కథావొస్తువు కోసం కూర్చుంటే జన్మలో రాయలేరు. మీ కోసం, ఓ రహస్యం—బట్టబయలు చెబుతాను వినండి. అనుసరించండి. నేటి పాప్యులర్ సీరియల్స్‌లో అత్యధిక భాగం ఆంగ్ల నవలల ప్రేతాలే. డెస్మండ్ బాలీ....ఇర్విన్‌వాలస్, ఆర్థర్ హెయిలీ ... హెరాల్డ్ రాబిన్స్....పీటర్ బ్లాట్లీ .... డెనిస్ రాబిన్స్ వగైరాల ధర్మమే మన తెలుగు సీరియల్స్. నేనూ యిన్ని రాశాను, యింకా రాస్తున్నానంటే—యిదే చిదంబర రహస్యం. ఐతే—వెధవ పనిచేసినా దొరక్కుండా ఉండాలి. అక్కడే మన టాలెంట్—రచయితగా—ప్రదర్శించాలి. మరువకండి, తెలుగు సీరియల్స్‌కి ఇంగ్లీషు నవలలూ సినిమాలే ఆధారాలు.)

నా తరంకాదు

జరిగిన కథ

నవల రాయటం మొదలుపెట్టిన రామచంద్రమూర్తికి అంతకు ముందురోజు మధుమూర్తిని కలిసినప్పుడు వాళ్ళు మాట్లాడుకున్న విషయాలు జ్ఞప్తికి వస్తాయి. రామచంద్రమూర్తిని 'గురుదక్షిణ' అడగటమే కాకుండా మరికొన్ని ప్రశ్నలుకూడా అడిగాడు. "పిల్లలు ఇద్దరేనా? వాళ్ళ భవిష్యత్తు ఏంటి?" "అవును ఇద్దరే. అమ్మాయి పెళ్ళికి ఇల్లు అమ్మటం ఆతర్వాత దైవాధీనం" అంటాడు. కానీ అలా జరక్కుండా ఒక్కొక్క సమస్యకి ఒక్కొక్క నవల పరిష్కారం అంటూ నవలరాయటం ఎంత సులభమో చెప్పేసరికి, ఇంటికి వచ్చిన రామచంద్రమూర్తి రాత్రికి రాత్రి కలలో వరుసగా ఆరు సీరియల్ నవలలు వ్రాసేస్తాడు.

ఇక చదవండి

ఇంత బ్రతుకూ బ్రతికి యింటి వెనక చచ్చాడన్నట్లు-ఎంగిలి రాతరాసి—స్వంతం అని భుజాలెగరేసుకోడమా? స్వంతంగా ఆలోచించి....స్వంతంగా రాయలేకపోతే.... మానేస్తానంతే.

(మహానుభావా! మీరు అజ్ఞానంలో పడిపోతున్నారు మళ్ళీ. ఈ ప్రపంచమే అద్దెకొంప కాగా—స్వంతమనే దెక్కడుంది మనుషులకి? ముళ్ళపూడేమన్నారు? ప్రపంచం....విశ్వం .... అప్పనే ప్రాథమిక సూత్రంమీదే నడుస్తూందనలేదూ? అప్పు తెచ్చుకోడం తప్పుకాదు. తీర్చలేని అప్పు తెచ్చుకోడం మరీ తప్పుకాదు. బెగ్.... బారో....అర్ స్టీల్. పోనీ.... దొరక్కుండా తప్పు.... అప్పు చెయ్యడంలో మీ ప్రతిభ చూపండి. అంతేకాని.... రాయడమే మానేస్తాననకండి. ఆరు సీరియల్స్....అరపై

వేలు....మీ యింటి పరిస్థితి మారిపోతుంది. మీ దశ మారి పోతుంది. మీ్రరాయండి. మిగిలింది నేను చూసు కుంటాను.)

శూన్యంలోకి (కిటికీలోంచి కనబడుతుంది) చూస్తూ కూర్చున్నాడు రామచంద్రమూర్తి. అతనికేమీ పాలు పోవడంలేదు. మధుమూర్తి—రచనంటే కాపీ అని తేల్చి పారేశాడు! మరీ ప్రసిద్ధుడయిన....సీరియల్‌కి పదివేలూ.. పుస్తకానికి పదివేలూ తీసుకునే రచయిత కనుక అత డబద్ధం చెప్పాడనుకుందుకు వీలులేదు. పైగా తనంటే అభిమానము కొద్దీ చెప్పాడు. కానీ .... దొరక్కపోతే మాత్రం—కాపీ రాపీయే కదా? అంతరాత్మముందు.... దోషిలా మిగులుతాడే!

(అంతరాత్మ....దోషి....కథలమాటలు సార్. బాగు పడదలచుకుంటే—వాటిని జీవితంలోకి రానివ్వకూడదు. అదే ప్రయోజకత్వం. మొదలుపెట్టండి....ఆలోచించ కుండా రాసుకుపోండి. ఇప్పటి నవలలకీ సీరియల్స్‌కి కావలసినవి పేజీలు. ఆలోచనలు కావు. పాఠకులకి— ఆలోచించడం లేబర్. ఆలోచించనక్కర లేకుండా చదవ డం—ప్లెషర్. కనుక రచయితకూడా ఆలోచించకుండానే రాయాలి.)

కాని....అలారాస్తే....నిలవొద్దూ?

(రాయడమే రచయిత పని. ఓసారి యస్సనేశాక సంపాదకుడే మీ రచన సంగతి చూసుకుంటాడు. ఆరు నెలల ముందునుంచీ మీ నవల గురించి ఊరిస్తాడు, ఊదర గొడతాడు. నవల వేసేంత కాలమూ ప్రశ్నలకు జవాబులనీ, ఆ నవల రాసేటప్పుడు మీరేయే దుస్తులు ధరించారు, ఏమేం పిండివంటలు తిన్నారు—వంటి ఉప కథలువేసి పాఠకులని వెర్రి వాళ్ళని చేస్తాడు. ముగింపు చెబితే బహుమతి....చివరి వాక్యంలో మూడో అక్షరం ఊహించగలిగితే ఓ బహుమతి....అలాగ స్కీములు వేసీ.... పాఠకులు రాయకపోతే తనే వదిపేర్లతోనూ పొగడ్త ఉత్తరాలు ప్రచురించీ—మీ సీరియల్‌ని బ్లో అప్ చేస్తాడు. మంత్రసానితనం ఒప్పుకున్నాక తప్పదు కదా! మన నరుసని మనం పొగడుకోడంలో తప్పులేదు. సర్కు లేషన్—పత్రికకి ప్రాణం. పత్రిక — సంపాదకుడికి ప్రాణం. స్ట్రగుల్ ఫర్ ఎగ్జిస్టెన్స్.)

బాగానే ఉంది. కానీ....సీరియల్ వేసేముందు ఆరు నెలలు హడావిడి చేశాక—సీరియల్ ముగిశాక ఆరువారా లయినా పాఠకులు గుర్తుంచుకోకపోతే రచయితకి సిగ్గె య్యదూ? అదీకాక రచనని ఎవరో నిలబెట్టడమేమిటి, తన కాళ్ళమీద అది నిలబడగలగాలిగాని? చేట పెయ్యిని తోసినట్లు నవలని పాఠకులలోకి తొయ్యడమా? ఎంత హాస్యాస్పదం. నవలలో సత్తా ఉండి....అది నిలబడ గలగాలి. అప్పుడు రచయితకి తృప్తి.

(మాస్టారూ!....కోపంగా.... చిరాగ్గాఉంది మధుమూర్తి కంఠం. మీరు దయచేసి-చొప్పదంటు ప్రశ్నలు వెయ్య కండి. కాలంతోపాటు పొండి. బాగుపడతారు. ఊరంద రిదీ ఒక దారీ, ఉలిపి కట్టెదొక దారీ అన్నట్లు ప్రవర్తించ కండి.

మీ అమ్మాయికి మంచి సంబంధం కోసం, మీ అబ్బా యికి మంచి చదువు, ఉద్యోగంకోసం, మీ శ్రీమతిని సంతోషపెట్టడంకోసం, మీరు బాగుపడ్డం కోసం.....)

రామచంద్రమూర్తికి కన్నీళ్ళు వొచ్చేశాయి. సీరియల్ రాయాలి. ఎలాగేనా రాయాలి. నిజమే. తన కోసం కాక పోయినా....తన వారి కోసమయినా రాసితీరాలి.

కాని....ఎలా? మొదటి వాక్యం రాయడమే తన తరం కావడంలేదే! కృత్యాద్యవస్థలోనే మిగిలిపోయాడే!

మూడువందల పేజీల చెత్త....గాలి....(మధుమూర్తి మాటలు) పోగు చెయ్యాలా! అవాకులూ చెవాకులూ నింపాలా?

తనకి సాధ్యం కాదేమో. (ఆతడనేక యుద్ధముల నారియుతేరినవాడు కథలు రాసిన మీకు నవల రాయడం కష్టమేమిటి? ఎవరన్నా నవ్వుతారు. నమ్మరు.)

లేదు మధుమూర్తీ....నే వ్రాయలేను....నిజంగా....

కళ్ళు తుడుచుకుంటూ ఉండిపోయాడు దీనంగా, పరా జితుడిలా. అప్పుడే....

* *

"రామచంద్రమూ ర్తీ !"

బయటనుంచి పిలుపు. బ్రతుకు జీవుడా అనుకుంటూ ఆనందంగా లేచాడు, భగవంతుడే తనని రక్షించాడను కుంటూ. ఇవతలకి....వరండాలోకి వచ్చాడు, ఎవరా అని.

"నువ్వా !"

"నేనే కానీ....ఏమిటీ అవతారం ? "

సిగ్గుపడ్డాడు రామచంద్రమూర్తి. ఏం చెప్పాలి ? అనవసరంగా అబద్ధమాడడం యిష్టంలేదు. నిజం చెప్తే అతను నవ్వుతాడు. "ఏమీలేదు-" అన్నాడు గొణుగుతూ.

"ఏదో ఉంది." నవ్వాడతను.

"మరే....నవలరాద్దామనీ...." అనేశాడెలాగో.

"వాట్ ! నువ్వు.... నవల రాస్తావా ! కథలేరాస్తు న్నట్లు లేదీ మధ్య ? "

" ఔననుకో. సరే కాని ...ఏమిటి నువ్విలా దయ చేశావ్ హటాత్తుగా ? "

"అదో పెద్దకథ....నువ్వు యీ అవతారం వొదిలేసి-నరావతారం ఎత్తివొస్తే-బయటకు పోదాం".

"నిముషం !" అనేసి లోపలికి వెళ్ళాడు రామచంద్ర మూర్తి. ముఖం కడుక్కున్నాడు. పట్టుపంచె విప్పేసి మామూలు పంచె కట్టుకుని షర్టు వేసుకున్నాడు. పార్వతిని కేకవేసి తలుపు వేసుకోమన్నాడు.

"పద." అన్నాడు కదులుతూ.

దయానిధి అతనూ ప్రక్క-ప్రక్కన నడుస్తున్నారు రోడ్డుమీద.

"చెప్పు. ఏమిటి విశేషం ?" అడిగాడు రామచంద్ర మూ ర్తి.



" నేనింకా అసిస్టెంట్ లెక్చరర్‌గానే ఉంటున్నానని తెలుసుగా ?" అడిగాడు దయానిధి.

"ఊఁ."

"లెక్చరర్‌నేనా అవాలని బుద్ధి పుట్టింది "

"మంచిదే."

"పట్టుదలతో ఎమ్మే పూర్తయిందనిపించాను. పి. హెచ్. డి. కూడా చేయగలిగితే....హెడ్ ఆఫ్ ది డిపార్ట్‌మెంట్ రాకపోయినా లెక్చరర్‌గా ప్రమోషన్ వొస్తుంది. "

"అంటే-థీసిస్ పని మిగిలిందన్నమాట. మరి-దేని మీద రిసెర్చి చేద్దామనుకున్నావు ?" అడిగాడు రామచంద్ర మూ ర్తి .

"తెలుగునవల మీద!"

ఆశ్చర్యపోయినట్లు చూశాడు దయానిధి వేపు.

"ఔను. తెలుగు నవలమీదే. సరిగ్గా చెప్పాలంటే ఆంధ్రులమీద తెలుగు నవల చూపుతూ వొచ్చిన ప్రభావం మీద".

"చాలా కష్టమయిన విషయం కాదూ?"

"ప్రయత్నిస్తే....కష్టముండక పోవచ్చు...."

"అదికాదు. ఇటువంటివి ఇన్‌టాన్జిబుల్ (intangible) సబ్జక్ట్స్. మేటర్....మెటీరియల్ దొరకడం కష్టం".

"నిజమే. కాని-యిటువంటి క్లిష్టమయిన విషయాలమీద పరిశోధనచేస్తే-కొంత సింపతెటిక్‌గా చూస్తారు. దయా ధర్మంగా అయినా ఓ పి. హెచ్. డి. పారేస్తారు చూసీ చూడనట్లు. విషయం క్లిష్టమైతే డాక్టరేట్ యివ్వడంలో కొంచెం వెసులుబాటు చూపవచ్చు".

"ఓహో!"

"నేనిక్కడ పదిరోజులుంటాను".

"చాలా సంతోషం. మా యింట్లో ఉందువుగాని".

"వొద్దు ...హోటలు రూములో ఉండడమే నాకు వీలు. కొంతపని కూడా చేసుకుంటూ ఉండాలి కదా తీరిక దొరికి నప్పుడు? మరోసారి వొచ్చినపుడు ఉంటానులే. ఏమీ అనుకోకు".

రామచంద్రమూర్తి ముఖం అదోలాపెట్టాడు.

"బాధపడకు. అయినా-నేనిక్కడున్నన్నాళ్ళూ నీతో కలసే ఉంటాను. అసలు - నేనిక్కడకు వొచ్చిందే నీమీద ఆశతో".

"నిజంగా నీకు సహాయం చేయగలిగితే అంతకంటె కావలసిందేముంది నాకు?"

"నీ శక్తి నీకు తెలియదు. నాకు తెలుసు." నవ్వాడు దయానిధి.

"ఏమిటో....అదంతా నీ అభిమానం...."

"సరేలే....నువ్వేం నవల రాస్తున్నావు? పౌరాణి కమా?"

దయానిధి వొచ్చేసరికి తను పట్టుపంచె కుంకుమ బొట్టుతో ఉండడంచూసి అలా అడిగాడని గ్రహించిన రామచంద్రమూర్తి-అతను తనని ఆటలు పట్టించడానికి కాక నిజంగానే అలా అనుమానించి అడుగుతున్నాడని కూడా గ్రహించాడు.

"పౌరాణికం కాదు. సాంఘికమే".

"ఏమిటి కథావస్తువు?"

"అది తేలితే యింక లేనిదేం? ఏం రాయాలో తెలి యదు కాని ఎలా రాయాలో మాత్రం తెలుసు...."

"ఎలా రాయాలి?" ఉత్సాహంగా అడిగాడు దయానిధి.

"సస్పెన్సుండాలి. థ్రిల్లుండాలి. ప్రతి అధ్యాయమూ-అసంపూర్ణ వాక్యంతోటీ, చుక్కలతోటీ అంతమవాలి".

అయోమయంగా చూశాడు దయానిధి. "నీ మాటలు నాకేమీ అర్థం కావడంలేదు".

"నాకూ అర్థం కావడంలేదు". నవ్వేరాడు రామ చంద్రమూర్తి.

"అది కాదు....నువ్వురాసే నవల ఏం ప్రయోజనం సాధించాలని ఆశిస్తున్నావు రచయితగా?"

"పత్రికలో సీరియల్‌గా ప్రచురింపబడి ఐదువేలూ, పుస్తకరూపంగా ముద్రించబడి మరో ఐదువేలూ-మింజు మలె పదివేలరూపాయలు సంపాదించాలని. సినిమాకికూడా తీసుకోబడి మరో పదివేలో యిరవై వేలో తెస్తే యింకా ఆనందం".

"హాస్యం చాలించు".

"హాస్యం కాదు. నిజమే". తప్పు వొప్పుకుంటు న్నట్లన్నాడు.

"నువ్వు - డబ్బుకోసం రాస్తావంటే-నేన్నమ్మను. నువ్వంత నీచానికి దిగజారవు....దిగజారలేవు". కచ్చి తంగా అన్నాడు దయానిధి. ఇదేమాట రామచంద్రమూర్తి

మధుమూర్తితోసూ అన్నాడు. అంటే....అతను ఉగ్ర నరసింహమూర్తి ఐపోయి-

"డబ్బుకోసం రాయడం నీచమా? ఎవరన్నారు? ప్రభుత్వం-కాగితం అమ్మేది డబ్బుకోసం. పబ్లిషరు సంస్థని స్థాపించేది డబ్బుకోసం. పత్రికకు సంపాదకుడు పనిచేసేది డబ్బుకోసం. అక్షరాలను కూర్చి అచ్చువేసేది కంపోజిటర్ డబ్బుకోసం. ఆర్టిస్టు బొమ్మగీసేది డబ్బుకోసం. ఏజంటు పత్రికల నమ్మేది డబ్బుకోసం. ఇవేవీ తప్పూ నీచమూ కాదు. కాని-రచయిత నడుము విరిగేలా కూర్చుని రాసి-డబ్బు అనిస్తే అది నీచమూ, మహాపరాధమూనా? ఎవరు చెప్పారీ అన్యాయమయిన న్యాయం?

గురూజీ!.... రచయితలని వెర్రివాళ్ళని చేయడానికి ప్రయత్నించే యిటువంటి మాటలు వినకండి! నమ్మకండి, ప్రచారం చేయకండి" అని మెత్తగా చివాట్లుపెట్టి వదిలాడు మధుమూర్తి. అదేమిటో.... అతను చెబుతూంటే ప్రతి మాటా పరమసత్యంలాగే అనిపించింది. అతనన్నట్లు - ఎవడు మాత్రం ఏ పని డబ్బుకోసం కాక చేస్తున్నారని?

"ఏమిటాలోచిస్తున్నావ్?"

"ఏమీలేదు. ఇంతకీ నీ పరిశోధనా విషయం సరిగ్గా నాకర్థం కాలేదు. తెలుగు నవల-పాఠకులమీద చూపిన ప్రభావం అన్నావు. మొదటినుంచీనా? అంటే .. రాజశేఖర చరితము....అప్పటినుంచీనా?"

"అహ. పంథొమ్మిది వందల అరవైనుంచీ ఎనభై వరకూ అనుకో సుమారుగా".

"ఎటువంటి ప్రభావం? సాంఘికంగానా, ఆధ్యాత్మికంగానా? మరో విధంగానా".

"ఏ ప్రభావమయినా సరే".

అది అతనెలా సేకరిస్తాడో అర్థం కాలేదు. "ఏదయినా ప్రశ్నావళి తయారుచేసి, ఒక్కొక్కరిచేతా నింపిస్తావా? లేక....ప్రతివారినీ కలుసుకుని....ప్రశ్నలడిగి సమాధానాలు తీసుకుంటూ...."

"ఇంకా స్పష్టంగా ఏమీ అనుకోలేదు. చాలా వేళయింది. రేపు యిద్దరమూ కూర్చుని ఒక పథకం ఆలోచిద్దాం".

"అలాగే".

"నేను ఐదు గంటలకి మందే వొస్తాను. ఇంటి దగ్గరుంటావా?"

"ఆఫీసునుంచి నేనే నీ హోటలు గదికి వొచ్చేస్తాను. అలా అయితే కాలం కలసి వొస్తుంది".

"హోటల్ మయూరి....రూమ్ నంబరు ఎనిమిది".

ఉలిక్కిపడ్డాడు రామచంద్రమూర్తి. మధుమూర్తి బస చేసినదీ అదే హోటల్ గది. దయానిధి-అసిస్టెంటు లెక్చరర్‌గా చేస్తున్నా ఆస్తిపరుడే. పిత్రార్జితం బోలెడుంది. నిజంగా - రిసెర్చి, ప్రమోషన్ కోసం అయి ఉండదు. పి. హెచ్. డి. అనిపించుకుందామని వెర్రి పుట్టుంటుంది యీ డాక్టరేట్ల రోజులలో.

"నేనుంటాను. అన్నట్లు రేపు మనం పిచ్చాసుపత్రికి వెళ్ళవలసి ఉంటుంది".

"పిచ్చాసుపత్రికా! నేనెందుకూ?"

"నాకు తోడు. అక్కడ డాక్టరు-దూరపు బంధువు. ఓ పలకరింపు పలకరించి రావాలి".

"సరే".

ఇద్దరూ విడిపోయారు జంక్షన్‌లో.

రామచంద్రమూర్తి మెదడులో హటాత్తుగా ఒక ఆలోచన మెరుపులా మెరిసింది. తెలివితేటలు వక్రిస్తే పిచ్చి. ప్రతి పిచ్చివాళ్ళకీ కథలుంటాయట. రేపు....తను వెళ్ళబోయే ...ఆ పిచ్చాసుపత్రిలో—నవలకి వస్తువేమయినా దొరుకుతుందేమో? పిచ్చికూడా మనుషులని ఆకర్షిస్తుంది. అంచేత....రేపు పిచ్చాసుపత్రిలో జాగ్రత్తగా చూడాలి కథావస్తువు కోసం. ఆ రాత్రి—నిద్రలో—అతనికి పిచ్చికల వొచ్చింది.

(సశేషం)

## శ్రామికజన శ్రేయోభిలాషి

# శ్రీ వరాహగిరి వెంకటగిరి

ఆయన కార్మికుడుగా పుట్టి వుండకపోవచ్చు, కలవారి ఇంటిలోనే పుట్టి వుండవచ్చు; ఐర్లెండులో బారిష్టరీ చదివి వుండవచ్చు. కాని, రాష్ట్రపతి శ్రీ వరాహగిరి వెంకటగిరిని మించిన కార్మిక నాయకులెందరున్నారు? ఉన్నత సంస్కృతీ సంపన్నమైన కుటుంబంలో జన్మించి, ఉన్నత విద్యావంతుడై వుండి కూడా, ఆయనవలె కార్మిక జనసేవకు జీవితాన్ని అంకితం చేసిన నిస్వార్థ ప్రజా సేవకులెందరున్నారు?

మద్రాసులో కార్మికమంత్రిగావున్నా, సిలోన్‌లో ఇండియా హైకమీషనర్‌గావున్నా కేంద్రంలో Labour Minister గా వున్నా, మైసూర్ గవర్నర్‌గావున్నా, ఢిల్లీలో రాష్ట్రపతి భవనంలోవున్నా, శ్రీ గిరి కార్మిక నాయకుడే, ఆయన తపన కార్మిక సంక్షేమాన్ని గురించే!

అందువల్లనే "గత 40 సంవత్సరాలుగా నేను కార్మిక సంక్షేమం కోసమే కృషి చేసాను. నేను మొదట కార్యకర్తను మాత్రమే. చివరివరకు కార్యకర్తగానే వుంటాను. ఎప్పుడూ కార్యకర్తగానే వుంటాను" అని ఆయన ఒకసారి అన్నారు.

అందువల్లనే, కార్మికులకు అన్యాయం జరిగినా-అక్రమం జరిగినా-ఆయన సహించరు కాబట్టి, 1954లో కేంద్ర కార్మికమంత్రిగా వున్నప్పుడు బ్యాంకి ఉద్యోగులకు అన్యాయం జరిగిందని భావించగానే ఆయన నెహ్రూతో వివాదపడి తన మంత్రి పదవిని తృణప్రాయంగా పరిత్యజించారు. ఉపరాష్ట్రపతిగా కార్మిక సంక్షేమానికై కృషి చేయడమే తమ లక్ష్యమని, కార్మికులకు అన్యాయం జరిగిందని భావిస్తే, ఎప్పుడైనా తాను పదవీ పరిత్యాగం చేయగలనని ఆయన ఒకసారి మద్రాసులో అన్నారు. అందుకే ఆయన కార్మికనాయకుడు గిరి!

### నెహ్రూ కుటుంబం — గిరి కుటుంబం

శ్రీ గిరి కుటుంబాన్ని నెహ్రూ కుటుంబంతో పోల్చవచ్చు. జవహర్‌లాల్ తండ్రివలె గిరి తండ్రికూడా ప్రముఖ న్యాయవాది; నెహ్రూ తండ్రి అలహాబాద్‌లో గొప్ప లాయరైతే, గిరి తండ్రి బరంపురంలో ప్రముఖ న్యాయవాది. అలహాబాద్‌లో మోతీలాల్ ఆనందభవనం స్వాతంత్ర్య సమరయోధులతో కిటకిటలాడుతూ వుండేది; బరంపురంలో జోగయ్య పంతులుగారి ఇల్లుకూడా అలాగే స్వాతంత్ర్య యోధులకు నిలయంగావుండేది. స్వాతంత్ర్యోద్యమంలోచేరే సరికి మోతీలాల్ వేలకొలది రూపాయలు

### తుర్లపాటి కుటుంబరావు

ఆర్జిస్తూ వుండేవారు. జోగయ్య పంతులుగారుకూడా అంతే. ఆయన క్లయింట్లలో చాలామంది జమీందార్లు. వారు తమ ప్లీడరుగారికి దోసిళ్ళనిండా ఫీజు చెల్లించేవారు. నెహ్రూ కుటుంబం వలెనే గిరి కుటుంబంకూడా సంస్కృతీ సంపన్నమైనది. వారి కుటుంబంలో వలెనే వీరి కుటుంబములో కూడా అందరూ సంఘసేవా పరాయణులు. స్త్రీలు సహితం శాసన సభ్యత్వాలను అలంకరించారు. కుటుంబ సభ్యులందరూ రాజకీయ చైతన్యం కలవారు. జవహర్‌లాల్ బారిస్టర్ అయితే, గిరికూడా బారిస్టరే. నెహ్రూవలె గిరికూడా తండ్రిని మించిన తనయుడు. మోతీలాల్, జవహర్‌లాల్ ఒకే సమయంలో రాజకీయరంగంలో ప్రముఖ పాత్ర వహించగా, జోగయ్య పంతులు, గిరికూడా ఒకే తరుణంలో రాజకీయాలలో కీలకపాత్ర నిర్వహించారు. జవహర్‌లాల్ కాంగ్రేసు అధ్యక్షుడుగా వున్నప్పుడు, ఆ ఎ. ఐ. సి. సి. లో మోతీలాల్ సభ్యుడు. 1937లో

మద్రాసు శాసనసభలో శ్రీ గిరి కార్మికమంత్రి అయితే, ఆయన తండ్రి జోగయ్య పంతులు శాసనసభ్యుడు. జవహర్‌లాల్ ప్రధాని అయితే, గిరి రాష్ట్రపతి పదవి అలంకరించారు. నెహ్రూ, గిరిలకు, ఇంతకంటే పోలికలు మరేమి కావాలి ?

## 'గిరి మహారాజుకు జై'

శ్రీ గిరి కార్మిక నాయకుడైన సంఘటన చాలా విచిత్రమైనది. ఒక సత్యాగ్రహంలో పాల్గొని బరంపురంలో జెయిలు శిక్షను అనుభవించి, విడుదలై చిరునవ్వుతో జెయిలునుండి బయటకు వస్తున్నారు. ఖరగ్‌పూర్ నుంచి వచ్చిన రైల్వే కార్మిక సంఘంవారు ఆయనకు పూలమాలలువేసి "గిరి మహారాజుకి జై !" అంటూ నినాదాలు చేస్తూ "ఇకనుంచి మీరే మా సంఘానికి ఉపాధ్యక్షు" లన్నారు. ఆ యువ నాయకునిలోని నిజాయితీ, నిస్వార్థ ప్రజాసేవాశక్తి వారిని ఆకర్షించాయి. అంతే ! ఆ క్షణం నుంచి శ్రీ గిరి కార్మిక నాయకుడు.

## "క్విట్" నోటీసు

శ్రీ గిరి 1894 ఆగస్టు 10వ తేదీన గంజాంజిల్లా బరంపురంలో జన్మించినారు. ఈయన శ్రీ వెంకట జోగయ్య పంతులుగారి రెండవ కుమారుడు. కళ్ళికోట కాలేజీలో విద్యాభ్యాసం చేసిన తరువాత ఐర్లెండ్ నేషనల్ యూనివర్శిటీలో బారిష్టరు చదివారు. అక్కడ భారతీయ విద్యార్థుల సంఘాన్ని స్థాపించి దానికి అధ్యక్షులైనారు. ఆ సమయంలోనే ఆయనకు ప్రఖ్యాత ఐరిష్ విప్లవనాయకులు డీవెలరా, కాలిన్స్ మొదలైన వారితో పరిచయం ఏర్పడింది. ఆ రోజులలో ముమ్మరంగా సాగుతున్న ఐరిష్ స్వాతంత్ర్యోద్యమాన్ని ఆయన సమర్థించగా, అది బ్రిటీష్ సామ్రాజ్యవాద ప్రభుత్వానికి కన్నెర్ర అయింది. ఆయనకు "క్విట్" నోటీసు యిచ్చింది. అందువలన శ్రీ గిరి 1916 జూలైలో ఇండియాకు తిరిగి రావలసివచ్చింది. తత్ఫలితంగా ఆయన బారిష్టర్ పట్టాను తీసుకోవడం కుదరలేదు.

ఆ రోజులలో గాంధీజీతో పరిచయం ఏర్పడినప్పటికీ, ఐరిష్ విప్లవోద్యమంతో సంబంధం వున్నందువల్ల, హింసాయుతంగానే బ్రిటీష్ ప్రభుత్వాన్ని సాధించాలని అప్పట్లో ఆయన భావించారు. అయితే తరువాత ఆయన తన భావాల్ని మార్చుకొని ప్రజాస్వామ్య పంథాను అనుసరించారు.

## కార్మిక ఉద్యమాలు

ఇండియాకు తిరిగివచ్చిన తరువాత మద్రాసులో కొంత కాలం అడ్వకేట్‌గా ప్రాక్టీసు చేసారు. ఆ సమయంలో హోమ్‌రూలు లీగ్‌లో చేరి అనిబిసెంట్, తిలక్‌లతో కలిసి పనిచేసారు. గాంధీజీ పిలుపునిని, న్యాయవాద వృత్తికి పూర్తిగా స్వస్తిచెప్పి స్వాతంత్ర్యోద్యమంలో దుమికారు. అయినప్పటికీ ఆయన దృష్టి అంతా కార్మిక సంక్షేమం పైపే వుండేది. అప్పట్లో ఒకసారి ఖరగ్‌పూర్ రైల్వే వర్కుషాపులో సమ్మె జరిగింది. బెంగాల్—నాగపూర్ రైల్వేలోకూడా సమ్మె జరిగింది. మొదటి దానిలో 12 వేలమంది, రెండవ దానిలో 40 వేలమంది కార్మికులు సమ్మెలో పాల్గొన్నారు. ఈ రెంటికీ శ్రీ గిరి నాయకులు. యావద్భారతం దృష్టిని ఈ రెండు సమ్మెలు ఆకర్షించాయి. ఈ సమ్మెలు కొన్ని నెలలు తరబడి నడిచాయి. మొత్తం మీద కార్మికుల ప్రయోజనాలను ఆయన సాధించగలిగారు. ఆ దెబ్బతో కార్మిక నాయకుడుగా శ్రీ గిరి పేరు మన దేశంలో మారుమ్రోగింది. అఖిలభారత రైల్వే పనివారల సంఘమునకు ఆయన 12 సంవత్సరాలు కార్యదర్శిగా, అధ్యక్షుడుగా వున్నారు. ఒకసారి రైల్వే బోర్డువారు కార్మికులను రిట్రెంచి చేయడానికి ప్రయత్నించగా, గత్యంతరంలేక కార్మికులు సమ్మెకు దిగారు. శ్రీ గిరి జోక్యంతో కమిటీ నియామకం జరిగింది. రిట్రెంచిమెంటు తీవ్రత తగ్గింది. ఆ రోజులలో కేంద్ర శాసనసభలో ప్రతిపక్ష నాయకుడుగా వున్న పండిట్ మోతీలాల్ సహితం శ్రీ గిరిని కార్మిక నాయకుడుగా గుర్తించి, కార్మికులపై జరిగిన దౌర్జన్యాల దర్యాప్తుకు శ్రీ గిరిని నియమించి,

ఆయన సమర్పించిన నివేదికను గురించి కేంద్ర శాసన సభలో ప్రస్తావించారు.

## కేంద్ర శాసన సభ్యత్వం

కొంత కాలానికి శ్రీ గిరి కేంద్ర శాసనసభ్యులైనారు. ప్రఖ్యాత కార్మిక నాయకులు శ్రీ ఎస్. యం. జోషితో కలిసి కార్మిక సంక్షేమానికై అహోరాత్రులు పాటు పడ్డారు. కేంద్ర శాసనసభలో వున్నప్పుడు ఫిరోజిషా రోడ్డులోవున్న ఆయన గృహం ఎల్లప్పుడూ కార్మికులతో కిటకిటలాడుతూ వుండేది. ఆయన కార్యదర్శికి, మైపు రైటర్కు కార్మిక సమస్యలకు సంబంధించిన మెమోరాండములు తయారుచేయడంలో ఊపిరి సలిపేది కాదు. అనేక కార్మిక సమస్యలను పరిష్కరించారు. ఒక ముఖ్యమైన హక్కును కార్మికులకు సంపాదించిపెట్టిన ఘనత ఆయనకే దక్కింది. కార్మిక సంఘములను సంప్రదించకుండా ఎలాంటి శాసనాలను చేయబోమని, అప్పట్లో కేంద్ర ప్రభుత్వ కార్మికశాఖా సభ్యుడు సర్ ఫ్రాంక్ వాయస్ శ్రీ గిరికి హామీని యిచ్చారు. ఇది నిజంగా భారత కార్మిక లోకానికి గొప్పహక్కు. దానిని సంపాదించి పెట్టిన ఘనత శ్రీ గిరికే దక్కింది.

## బొబ్బిలిలో విజయం

1937 ఎన్నికలలో శ్రీ గిరి బొబ్బిలి రాజాతో పోటీ చేసి గెలిచి మద్రాసు శాసనసభకు ఎన్నికైనారు. ఈ ఎన్నికలు యావత్ భారతదేశ దృష్టిని ఆకర్షించాయి. బొబ్బిలి రాజా మద్రాసు ముఖ్యమంత్రి పదవిని నిర్వహించారు. ఆయన జస్టిస్ పార్టీ నాయకుడు. అందులో ఆ ప్రాంతంలో మంచి పలుకుబడి కలిగిన వ్యక్తి. ఆ ఎన్నికలలో శ్రీ గిరి తరుపున ప్రచారం చేయడానికి కాంగ్రెసు అధ్యక్షుడు నెహ్రూకూడా వచ్చారు. ఆయన ప్రసంగిస్తున్న సభలోనికి ఏనుగులను పంపించి బొబ్బిలి రాజా సభను భగ్నం చేయించారు. అందువలన ఆ ఎన్నికకు మరింత ప్రాధాన్యత లభించింది. ఆ ఎన్నికలలో శ్రీ గిరి అఖండ విజయం సాధించడంతో ఆయన పేరు యావత్ భారతదేశం మారుమ్రోగింది.

## కార్మిక మంత్రిత్వం

మద్రాసు రాష్ట్రంలో రాజాజీ మంత్రివర్గంలో శ్రీ గిరికి కార్మికమంత్రి పదవి లభించింది. తమ ప్రతినిధి మంత్రి అయినందుకు కార్మికులు అమితానందం పొందారు. ఆయన కార్మికులకు ఏ సమయంలోనైనా దర్శన మిచ్చేవారు. వారి కష్ట సుఖములను ఆప్యాయంగా తెలుసుకొనేవారు. "కార్మికులారా! లెండి. మీ జీవన పరిస్థితులను అభివృద్ధి చేసుకోండి! ఈ ప్రభుత్వం మీది. కార్మికశాఖ కార్మికులదే" అని ఆయన శంఖారావం పూరించారు. శ్రీ గిరి హయాములో కార్మికుల పనిగంటలు తగ్గాయి. వారి జీతాలు హెచ్చాయి. శెలవలు పెరిగాయి. 1939లో బ్రిటీష్ యుద్ధ విధానానికి నిరసనగా శ్రీ గిరికూడా తన పదవికి రాజీనామా చేసారు. 1946 లో శ్రీ గిరి తిరిగి కార్మికమంత్రిగా నియుక్తులైనారు. అప్పుడు ముఖ్యమంత్రి ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుగారు. వారంటే శ్రీ గిరికి అపారమైన భక్తిగౌరవాలు. ప్రకాశం మంత్రివర్గ పతనానంతరం శ్రీ గిరి సింహళంలో ఇండియా హైకమీషనర్‌గా కొంతకాలం పని చేసారు. 1952 లో శ్రీ గిరి లోకసభకు ఎన్నికకాగా కేంద్ర మంత్రివర్గంలో ఆయనను శ్రీ నెహ్రూ కార్మికమంత్రిగా నియమించారు. బ్యాంకి ఉద్యోగులకు అనుకూలంగా జస్టిస్ రాజాధ్యక్ష యిచ్చిన తీర్పును మార్పించడానికి భారత ప్రభుత్వం నిర్ణయించగా, శ్రామికజన శ్రేయోభిలాషి శ్రీ గిరి అందుకు నిరసనగా తన మంత్రి పదవికి రాజీనామా చేసారు. 1957 ఎన్నికల తరువాత శ్రీ గిరి ఉత్తరప్రదేశ్ గవర్నరుగా నియమించబడ్డారు. ఆ తరువాత ఆయన కేరళ గవర్నరుగా నియుక్తులైనారు. క్లిష్టమైన ఆ రాష్ట్ర పరిపాలనా నిర్వహణలో ఆయన అన్ని రాజకీయ పక్షాల అభిమానాన్ని చూరగొన్నారు.

> " భారతీయులుగా జీవించడం అలవరుచుకోండి. విదేశీ విజ్ఞాన సంపర్కంవల్ల భారతీయ చైతన్యం మనలో నశించింది. భారతీయ చైతన్యం, భారతీయ విజ్ఞానం అంటే దేవుడి గుడికి వెళ్ళుట, కట్నాలు, నగలు, చీరలు, అందచందాలు, కుంకుమ కాదుసుమా! భారతీయ విజ్ఞానమంటే తరతరాలనుంచీ కాపాడబడిన భారతీయ సత్సాంప్రదాయాలే. అట్టి సత్సాంప్రదాయాలు మనకు బలం చేకూరుస్తాయి. "
>
> - శ్రీమతి సరోజినీనాయుడు

## ఉపరాష్ట్రపతి పదవి

1967 లో అంతకు పూర్వం ఉపరాష్ట్రపతిగా వున్న డా. జాకిర్ హుస్సేన్ రాష్ట్రపతి పదవికి కాంగ్రెసు అభ్యర్థి అయ్యేసరికి, ఆయన స్థానంలో శ్రీ గిరిని అభ్యర్థిగా కాంగ్రెసు నిర్ణయించింది. ఆయనతో పాటు ఉపరాష్ట్రపతి పదవికి ప్రొఫెసర్ హబీబ్ అనే అధ్యాపకుడు పోటీ చేసారు. ఆ ఎన్నికలలో పార్లమెంటులో కాంగ్రెసు సంఖ్యా బలానికి మించిన ఓట్లు శ్రీ గిరికి రావడం ఆశ్చర్యకరం. ప్రతిపక్షాల ఓట్లుకూడా ఆయనకు పడినవన్నమాట. దీనినిబట్టి ప్రతిపక్షాల అభిమానాన్నికూడా ఆయన ఎంతగా చూరగొన్నది అవగతమౌతుంది.

## రాష్ట్రపతి పదవి

1969 మే 3న రాష్ట్రపతి జాకిర్ హుస్సేన్ ఆకస్మికంగా మరణించడంతో శ్రీ గిరి తాత్కాలిక రాష్ట్రపతి కావడం జరిగింది. రాజ్యాంగం ప్రకారం తాత్కాలిక రాష్ట్రపతి ఆరు మాసాలు మాత్రమే ఆ పదవిలో వుండాలి. ఉపరాష్ట్రపతినే రాష్ట్రపతిగా ఎన్నుకోవడం అంతవరకు వస్తున్న సాంప్రదాయం. అయితే కాంగ్రెసు ఆ సాంప్రదాయాన్ని ఉల్లంఘించడం వలన శ్రీ గిరికి బాధ కలిగింది. శ్రీ సంజీవరెడ్డిని కాంగ్రెసు అభ్యర్థిగా నిర్ణయించి, మొదట్లో శ్రీమతి గాంధీ ఆయనను బలపరిచింది. తన కంటె రెండు దశాబ్దాలు చిన్న అయిన వ్యక్తిక్రింద ఉపరాష్ట్రపతిగా పనిచేయడానికి శ్రీ గిరికి మనస్కరించలేదు. ఉపరాష్ట్రపతి పదవికి రాజీనామాచేసి రాష్ట్రపతి పదవికి శ్రీ గిరి ఇండిపెండెంటుగా పోటీ చేసారు ఇది నిజంగా సాహసమే. ఎందువల్లనంటే అప్పటికి ఆయన వయస్సు 75 సంవత్సరాలు. ఆనాటి పరిస్థితినిబట్టి ఒక సామాన్యుడు కాంగ్రెసు అభ్యర్థితో ఇండిపెండెంటు అభ్యర్థిగా పోటీ చేయడం అంత తేలికైన విషయం కాదు. అయినా శ్రీ గిరి రాష్ట్రపతి ఎన్నికల యుద్ధంలోకి దుమికారు. సుదీర్ఘమైన ఆయన దేశసేవా చరిత్ర , కార్మిక నాయకత్వం, ఆయన చేసిన త్యాగం, అపారమైన అనుభవం ఆయనకు తోడ్పడినాయి. అన్ని వైపులనుంచి సహకారం లభించింది. చిట్టచివరికి ఆత్మ ప్రబోధం పేరిట శ్రీమతి ఇందిరా గాంధీ సహితం శ్రీ గిరిని బలపరచడం జరిగింది. శ్రీ గిరి రాష్ట్రపతి పదవికి ఎన్నికైనారు.

రాష్ట్రపతి పదవిలోవున్నా, నిరాడంబరత్వానికి ఆయన ఏ మాత్రం దూరం కాలేదు. అంత అత్యున్నత పదవిలో వున్నా, ఆయన అందరికీ అందుబాటులో వుండేవారు. అదే ఆయన ప్రత్యేకత, గొప్పతనం. ఒకప్పుడు బరంపురం జైలునుండి బయటకు వస్తుండగా, కార్మికులచే "గిరి మహారాజుకు జై" అనిపించుకున్న ఆయన మహారాజ పదవితో తుల్యమైన రాష్ట్రపతిపదవిని అలంకరించారు. అయితే, ప్రజానీకం ఆయన త్యాగనిరతి, సేవాభావాలకు మెచ్చి యిచ్చిన "మహారాజ పదవి" అది ! ఒక సామాన్యుడు, కార్మిక సంక్షేమం కోసం అహర్నిశలు కృషి చేసిన కార్మిక నాయకుడు భారతదేశ అత్యున్నత పదవిని అధిష్ఠించగలగడం చెప్పుకోదగ్గ గొప్ప విషయం. ప్రజాస్వామ్య వ్యవస్థలో ఉన్న విశేషం అదే.



# సహనం కావాలి! సద్విమర్శనలు వినాలి!!

లండను నగరంలో హైడు పార్కు అని ఉన్నది. దానిలో ఒకమూల ఉపన్యాసాలకు కేటాయించబడి ఉంటుంది. ఆదివారాలనాడు ఎవరైనాసరే వెళ్ళి, ఆ మూల పెట్టెలమీద నించొని, ఉపన్యాసాలు దంచవచ్చు. పార్కులో అక్కడా యిక్కడా కూర్చున్నవారు వాటిని ఆనందంగా వింటారు. వాటిని సోప్‌బాక్సు ఉపన్యాసాలంటారు. ఈ ఉపన్యాసకులు ఎవరినైనా, దేనినైనా విమర్శిస్తూ ఉంటారు. ఎవరూ పెద్దగా పట్టించుకోరు. విమర్శించబడిన వారుకూడా కోపగించుకొనరు.

ఒక పిట్టకథ ఉంది—దీనిమీద.

ఒకసారి ఓ సోప్‌బాక్సు ఉపన్యాసకుడు పోలీసులను తీవ్రంగా విమర్శిస్తున్నాడు. దూరంగా నించొని వింటున్న రచయిత అటువైపుగా ఓ పోలీసు రావటం చూచి భయపడ్డాడు. వచ్చిన పోలీసు ఆ ఉపన్యాసకుని ఏమైనా చేస్తాడేమోనని. కాని ఆ పోలీసు రచయిత దగ్గరికివెళ్ళి "ఏం సార్, దూరంగా, నిలుచున్నారేమిటి? దగ్గరగా వెళ్ళి వినరాదూ?" అని అడిగాడట.

బ్రిటనులో విలసిల్లుతున్న ప్రజాస్వామిక స్వేచ్ఛలకు ఇదొక చక్కటి ఉదాహరణ.

విమర్శను సహించటం, సద్విమర్శను ఆహ్వానించటం, నిర్మాణాత్మక విమర్శను ఆమోదించటం—ఇదొక ప్రజాస్వామికపు సాంప్రదాయం.

ఈ సాంప్రదాయం ఇంగ్లాండులోనే దెబ్బతిని పోతున్నదట. సోప్‌బాక్సు ఉపన్యాసకులమీద రాళ్ళు పడుతున్నాయట. ఇప్పుడిప్పుడు "అసహనం" అక్కడకూడ పెరిగిపోతున్నదట.

మనదేశంలో అయితే చెప్పనే అక్కరలేదు. విమర్శను సహించే ప్రజాస్వామిక సత్సంప్రదాయం స్వతంత్ర భారతంలో నెలకొల్పాలని ఆరాటపడేవారే కన్పించటం లేదు.

తనను విమర్శించే వారిని పండిత నెహ్రూ పరమ శత్రువుగా భావించేవాడు. ఆయన అల్లుడే (ఫిరోజ్ గాంధీ) ఆయనకు అట్లాంటి శత్రువైనాడు.

ఇందిరా గాంధీ అసహనం చరిత్రకే ఎక్కింది గదా! విమర్శలను తట్టుకోలేని ఆమె దేశం నెత్తిన ఎమర్జెన్సీనే తెచ్చి రుద్దింది.

## యువతావాణి

ఆర్.యస్.కే.మూర్తి

ఈ అసహనపు వ్యాధి ఇప్పుడిప్పుడు క్రమక్రమంగా అందరికీ వ్యాపిస్తున్నది, రాజకీయరంగంలో.

ఛోటాలు, ఛోక్రాలు కూడ సాంప్రదాయబద్ధమైన సద్విమర్శలను సహించలేక, దుర్మార్గాలకు పూనుకుంటున్నారు. పత్రికలపై అదుపులు, ఆంక్షలు విధించాలని ఉబలాటపడని ముఖ్యమంత్రులు అరుదై పోతున్నారు. పత్రికల వారిని చంపించే "ప్రజానాయకులు" ఎక్కువై పోతున్నారు. క్రింది స్థాయిల సంగతి చెప్పనే అక్కర లేదు, మరి.

తప్పులు చేయడం మనిషికుండే బలహీనత. వాటిని కప్పిపుచ్చుకోవాలని తాపత్రయ పడటం మరొక బలహీనత.

కాని ఆ తప్పును సమర్థించుకొని, దానిని ఎత్తిచూపిన వారిపై ధ్వజమెత్తటం అనుచితం. అన్యాయం.

రాజకీయ రంగంలో పెచ్చుమీరిపోతున్న ఈ 'అసహన రోగం' ముఖ్యంగా నేటి మన యువతలో పెచ్చుమీరి పోతున్నది.

# మంటల్లో స్వాతంత్ర్యం

అర్థరాత్రి అంధకారం చిక్కగానే ఉంది
ఉదయపు తొలిఝాము కోడి కుయ్యనేలేదు
వెలుగు కిరణాలింకా చీకట్లను చీల్చలేదు.
ఇక్కడా-అక్కడా హృదయ విదారక
ఆర్తనాదాలు
మంటల్లో తగలబడిపోతున్న సృష్టికర్త
కరకు కత్తుల్తో తెగ నరుక్కోవటం
ఉన్మాద....ఉద్రేకాల మిత్రత్వం
ఈ అర్థరాత్రుల్లోనే విషవాయువులు
ప్రజల్ని పరామర్శించటం
గుడులు బడులు సర్వం జ్వలిస్తున్నాయి
గాలిలో ఎగిరే విహంగాలు కూలిపోతున్నాయి
ఎదఎదనా అడ్డుగోడలు, కలహాలు, అనుమానాలు
ఈ రాత్రి కాళరాత్రిలా ఉంది-అయినా
భళ్ళున తెల్లారి రానున్న ఉషోదయాన్ని
స్వాగతించాలని ఈ రాత్రంతా మేల్కొంటున్నా!
నా కళ్ళు మిరిమిట్లు గొలిపే వెలుగు.
అప్పుడే తెల్లారిందా ?
అయ్యో! నా దేశం చితిమంటల వెలుగుల్లో....
ఇందుకా ఉరిత్రాడునుండి నా దేశాన్ని
రక్షించుకొంది!
నా కళ్ళవెంట జాలువారుతున్న కన్నీటిబొట్లు
ఆ వెలుగుల్లోనే
మనకూ స్వాతంత్ర్యం వచ్చిందీ రోజేనంటూ
వెర్రి జెండా పైకి లేచింది!

— సంధ్యా లక్ష్మణ్

ఇంట్లో తండ్రి ఏ సందర్భంలోనో మందలిస్తే, ఆ తండ్రికే Motives అంటగట్టే ప్రబుద్ధులు (కొడుకులలో) కన్పిస్తున్నారు. తమను తప్పుపట్టిన తమయందు పక్షపాత బుద్ధితో వ్యవహరిస్తున్నాడని విమర్శించే తనయులు నేడు కన్పిస్తున్నారు.

ఉపాధ్యాయులు మందలిస్తే సహించే విద్యార్థుల సమితి శూన్య సమితే అవుతున్నది. చిల్లర మనుష్యుల విమర్శలను నిర్లక్ష్యం చేయవచ్చు.

బాధ్యులైనవారు విమర్శిస్తే, ఎందుకంటున్నారా అని ఆత్మవిలోకనం చేసుకోవాలి.

పంజాబు సమస్యను రాజకీయాల మయం చేయవద్దని జాతీయ ప్రతిపక్షాలు నెత్తినోరు పెట్టుకొని గోలపెట్టినయి. కేంద్రంలోని వారు పెడచెవిని పెట్టారు. నిప్పుతో రాజకీయా లాడారు. పులులపై వోట్ల వేటలు సాగించారు. ఫలితంగా ఏం జరిగింది ?

అమాయకులు వందలాదిగా బలైపోయారు, అయిపోతున్నారు.

జెట్ విమానం కుప్పకూలిపోయింది – అట్లాంటిక్ మహాసముద్రంలో. మూడు వందలమంది దుర్మరణం సంప్రాప్తమైంది. వారిలో ఇద్దరు మనకు సమీపస్థులైన పసికందులు; కె. ఎల్. రావ్ మనుమలు. ఈ దుర్మరణాలకు బాధ్యత ఎవరిది ? బాంబులు పెట్టిన టెర్రరిస్టులదా ?

టెర్రరిస్టులను రాజకీయంగా పెంచి పోషించిన వారిదా?

ప్రతిపక్షాలను, పత్రికలను కోపగించుకొనడం—పాలకులు చూపించే చెడుగు.

పెద్దలు, తమ మంచిచెడ్డలు చూడవలసిన ఆప్తులనుండి కూడ విమర్శను సహించలేక పోవడం – నేటి యువత చూపుతున్న దొసగు.

సహనం పెరగాలి యువతలో. సదసద్వివేచన, ఆత్మవిమర్శ అభివృద్ధి గాంచాలి రేపటి నాయకులలో. ఇదీ నేటి యువతావాణి. 

# బాలగంగాధర తిలక్

"స్వరాజ్యం నా జన్మహక్కు" — అంటూ స్వాతంత్ర్య శంఖారావాన్ని వినిపించిన మహనీయుడెవరో మీకు తెలుసా : ఆయనే లోకమాన్య బాలగంగాధర తిలక్ ! దేశభక్తికి, త్యాగ నిరతికి, పాండిత్యానికి, రాజకీయ దురంధరత్వానికి పేరుపడిన తిలక్, 1856 సం॥లో జూలై 26వ తేదీన రత్నగిరి అనే ఊళ్ళో చిత్పవన బ్రాహ్మణ కుటుంబంలో జన్మించారు. ఆయనకు పెట్టిన పేరు కేశవ. కాని ముద్దుముద్దుగా పిలిచే బలవంత్ లేక బాల అనే పేరు నిలిచిపోయింది.

తిలక్ చిన్నతనంలోనే కుశాగ్ర బుద్ధి, సాహసం, పట్టుదల మొదలైన లక్షణాలను కనపర్చేవారు. తన తోటి వారిలో ఆయన ప్రత్యేకత కొట్టవచ్చినట్టు ఉండేది.

తిలక్ తండ్రి పేరు గంగాధర రామచంద్ర తిలక్. ఆయన సంస్కృతభాషలో మహాపండితుడు, ఉపాధ్యాయుడు. పాఠశాలల ఉప తనిఖీ అధికారిగా ఆయన 1866 సంవత్సరములో రత్నగిరినుంచి పూనా పట్టణానికి వచ్చేశారు. అప్పటికి మన బాల తిలక్ పది సంవత్సరాల ప్రాయమువాడు ! ప్రాథమిక తరగతులు అప్పుడే పూర్తి చేశాడు. అయితే నేం ! అప్పటికే సంస్కృతంలోను, గణితశాస్త్రంలోను, వ్యాకరణంలోను తోటి విద్యార్థులందరి కన్న ఎప్పుడూ మిన్నగానే ఉండేవాడు అందుకు అసలైన కారణం అతని తెలివికి తోడు-యింటి దగ్గర తండ్రిగారు ప్రత్యేక శ్రద్ధ తీసికొని పాఠాలు బోధించడమే ! అలాంటి ప్రత్యేక శ్రద్ధను యీనాటి తండ్రులు ఎంతమంది తమ బిడ్డలమీద చూపగలుగుతున్నారు ? బిడ్డల శక్తి యుక్తులను కనిపెట్టి వాటిని పదునుపెట్టే ప్రయత్నం తల్లి దండ్రులు కనక చేస్తే ఆ బిడ్డలు మణులు, మాణిక్యాలు కాకపోరు !

గంగాధరశాస్త్రిగారు మన బాల తిలక్ విషయంలో ఆ పనే చేశారు. ఒకనాడు గంగాధరశాస్త్రిగారు కాదంబరి గ్రంథంలోని రచనా వైశిష్ట్యాన్ని గ్రహించి ఆనందించుతూండగా, ప్రక్కనే ఉన్న బాల తిలక్‌కూడ అందలి శ్లోకాలను కొన్నింటిని వినడం తటస్థించింది. కొంత తడవైన పిమ్మట తనకా గ్రంథాన్నిమ్మని బాల తిలక్ తండ్రిని అడిగాడు. తండ్రి నివ్వెరపోయాడు ! తనకే కొరుకుడు పడని కాదంబరి గ్రంథాన్ని తన తనయుడు కోరడం ఆయనకు ఆశ్చర్యాన్ని కలిగించింది ! అయినా ఆ పసివాడిని నిరుత్సాహ పరచకుండా యుక్తిగా అతని ధ్యాసను మళ్ళించాలనుకున్నాడు.

బాల సాహిత్య చిరామం

"నాయనా ! తిలక్ ఇంత చిన్నవయసులోనే ఇంత క్లిష్టమైన గ్రంధాన్ని పఠించడం అంటే సామాన్యము కాదు. అయినా నీ అభిరుచిని కాదనలేను. అంతకు ముందుగా యీ చిన్ని సమస్యను గణితశాస్త్రములో పరిష్కరించి తీసుకొని రమ్ము!" అంటూ ఒక జటిలమైన గణితశాస్త్ర సమస్యను అతని ముందుంచాడు. బాల తిలక్ ఆ గణిత సమస్యను చూడగానే గ్రహించేశాడు. "ఇది నాకు నా తండ్రి పెట్టిన కఠిన పరీక్ష! దీనియందు విజయం సాధించకపోతే యిక ఏ పనీ చేయలేనని తండ్రి భావన." అనుకుంటూ రెండు మూడుగంటలు ఏకాగ్రతతో, కుశాగ్ర బుద్ధితో, దీక్షతో, ఆ సమస్యను పలు విధములుగా విశ్లే

"సోదరులారా! ఎంతకాలం ఆలోచిస్తూ కార్యశూన్యులై యుంటారు? దేశభక్తులారా! ఇకచాలు, మీ ఆలోచనలు కట్టిపెట్టండి. కార్య నిరతులు కండి. వట్టి ప్రగల్భాలవల్ల ప్రజలకు విముక్తి కలుగదు. కార్య శూరులవ్వాలి. లెండు".

లాలాలజపతిరాయ్

షించుకొని కడకు సమస్యను సాధించి తండ్రిగారి మెప్పు పొందాడు! ఆ గ్రంథాన్ని అందుకొన్నాడు.

బుద్ధి కుశలతలో తిలక్ ఎంత దిట్టో, సత్యదీక్షలో, నిర్భయత్వంలో, స్వాతంత్ర్య పోకడలో అంత గట్టి! తప్పు చేయనప్పుడు తలవంచనేల? తనవారికి తలవంపులు తేనేల? అన్న సిద్ధాంతం అతనిది; చేసిన తప్పుకు శిక్ష పొందాల్సిందే; తప్పు చేయనప్పుడు ఎంతటి అధికారి నైనా సరే ఎదిరించాల్సిందే; అన్న విశ్వాసం అతనిది!

రత్నగిరిలో ప్రాథమిక పాఠశాలలో చదువుతున్నప్పుడు ఒక చిన్న "సంఘటన" జరిగింది. పాఠశాల మధ్యాహ్న విరామ సమయంలో కొందరు ఆకతాయి పిల్లలు వేరుశనగకాయల్ని ఒలుచుకొని తిని, తరగతి గది నిండా ఆ తుక్కు పోశారు. మధ్యాహ్నం పంతులుగారు రాగానే చూసి, పిల్లలందరిని ఆ చెత్త తీసిపారేయమని ఆజ్ఞాపించారు. అందరూ ఆయన మాట ప్రకారం చెత్తను పోగు చేస్తున్నారు. కాని మన బాల తిలక్ మాత్రం అందుకు అంగీకరించలేదు. విరామ సమయంలో జరిగిన దానికి తనకు ఏమీ సంబంధంలేదని, తాను చేయని పనికి తానెందుకు శిక్ష ననుభవించాలని మొరాయించాడు. తన మాట వినకపోతే బెత్తపుదెబ్బలు తగుల్తాయని ఉపాధ్యాయుడు బెదిరించారు. అయినా తిలక్ బెదరలేదు. నిర్భయంగా, అసమ్మతి సూచకంగా తరగతి వదలి వెళ్ళిపోయాడు. ఆ ఉపాధ్యాయుడు ఈ విషయాన్ని తిలక్ తండ్రితో ఫిర్యాదు చేశాడు. విషయమంతా విన్న గంగాధర శాస్త్రి తన కొడుకు చెప్పిన మాట నిజమేనన్నారు. చిరుతిళ్ళకు తన బిడ్డలకు డబ్బులిచ్చే అలవాటు తన యింట్లో లేదని చెప్పారు. తిలక్‌కు తండ్రి యిచ్చిన తర్ఫీదు ఎంత గొప్పదో దీన్నిబట్టి మనం తెలుసుకొనవచ్చును. సత్యదీక్షకు దోహదంచేసే విధంగా బిడ్డలకు తర్ఫీదు యివ్వవలసిన బాధ్యత తల్లితండ్రులదేగా!

తిలక్ తాతగారు ఒకసారి రత్నగిరి వచ్చారు. అప్పుడు 1857 సం॥ సిపాయీల యుద్ధం జరుగుతున్నది. బాల తిలక్‌కు ఆయన నానాసాహెబ్, తాత్యాతోపే, ఝాన్సీరాణి మొదలైన వారి వీరోచిత గాథల్ని కళ్ళకు కట్టినట్టు చెప్పాడు. ఆ వీరగాథల్ని విన్న బాల తిలక్‌కు ఆవేశం కట్టలు తెంచుకుని వచ్చింది. ప్రాణం పోయినా సరే - పరాయివాళ్ళతో పోరాడి, వారిని తరిమి కొట్టాలనే ఆలోచన అంత చిన్నతనంలోనే అంకురార్పణ జరిగింది. తన జీవితాన్ని దేశస్వాతంత్ర్య సంపాదన కోసం అంకితం చేయాలనే అభిలాష కలగడానికి యీ వీరగాథలే కారణమని తిలక్ పెద్దవాడయ్యాక ఓ సందర్భంలో చెప్తాడు.

అందుకనే చిన్న వయసులోనే వీరులగాథలు, పుణ్య పురుషుల చరిత్రలు, మహామహుల జీవిత చరిత్రలు, చదివినా, వినినా పిల్లల్లో సద్భావాలు, సద్గుణాలు, సత్శీలం - పాదుకునే అవకాశం ఎక్కువగ ఉంటుంది. అందుకు తిలక్‌లాంటి మహానుభావులే మనకు తార్కాణం!

దేశభక్తే ఆయన మతం! దేశాన్ని ప్రేమించడం తప్ప ఆయన వేరొక మతాన్నెరుగడు. అలాంటి తిలక్‌కు భారత స్వాతంత్ర్య సముపార్జనలో సముచిత స్థానం ఎప్పటికీ ఉంటుంది. ఈనాడు మనం పీలుస్తున్న స్వేచ్ఛా స్వాతంత్ర్య వాయువులకు దోహదకారి అయిన బాలగంగాధర తిలక్ 1920 సం॥లో ఆగష్టు నెల ఒకటవ తేదీన పరమ పదించాడు! భౌతికంగా ఆయన మరణించినా భారతీయుల హృదయాలకు ఆయనెప్పుడూ అమరుడే!

# అధికార భాషగా తెలుగు

## చిల్లర భవానీదేవి

**భారత** స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ప్రముఖ పాత్ర వహించిన ఆంధ్రులు స్వాతంత్ర్యానంతరం భాషా ప్రయుక్త రాష్ట్ర నిర్మాణసాధనలో ప్రముఖులుగా పరిగణింపబడినారు.

లార్డుకర్జను బెంగాలును మతప్రాతిపదికమీద విభజించినపుడు దేశమంతటా స్వాతంత్ర్య భావన ప్రజ్వరిల్లి వందేమాతరం ఉద్యమంగా మారింది. భాషా ప్రాతిపదిక మీద రాష్ట్రాలు ఏర్పడవలెననీ, పరిపాలన ప్రజల భాషలో జరగవలెననీ విద్యాబోధన మాతృభాషలో నేర్పబడ వలెననీ ఆంధ్రోద్యమం ప్రారంభమైనది. 1913 సం॥లో బాపట్లలో ప్రథమ ఆంధ్ర మహాసభలో దేశభక్త శ్రీ కొండా వెంకటప్పయ్యగారు మాతృభాషలో పరిపాలన విద్యాబోధన అవసరమని ధృవీకరించారు. ఆంధ్రోద్యమం ఈ విధంగా జాతీయోద్యమానికి పునాది అయింది. ఆనాడు తెలుగు జిల్లాలు మద్రాసు సంయుక్త రాష్ట్రంలోనూ, హైదరాబాదు సంస్థానంలోనూ, ఈ రెంటినీ అనుకొని ఉన్న ఇతర రాష్ట్రాలలోనూ ఉన్నాయి. 1948వ సం॥లో సంయుక్త మద్రాసు రాష్ట్రంలోనూ, 1952వ సం॥లో హైదరాబాదు రాష్ట్రంలోనూ ప్రాంతీయ భాషలను అధికార భాషలుగా నిర్ణయించటం జరిగింది.

మత ప్రాతిపదికమీద ఏర్పడిన స్వాతంత్ర్యం తాత్కాలికమేననీ, మతంకన్నా భాష ప్రధానమనీ 1971 నాటికి బంగ్లాదేశ్ ఏర్పడటంద్వారా ఋజువయింది.

1966వ సం॥లో ఆంధ్రప్రదేశ్ అధికారభాషా శాసనం జరిగింది. దీని ప్రకారం ఒక అధికార భాషా సంఘం ఏర్పడింది. పరిపాలనా భాషగా రాష్ట్రాలలోని భాషలు అమలుజరుపుటకు కేంద్రరాష్ట్ర శాసనాలు ఆయా భాషలలోనికి అనువదింపవలసి ఉంది. ఇంతవరకు 1960వ సం॥ నించి ఆంధ్రప్రదేశ్ శాసనసభలలోని బిల్లులు ఇంగ్లీషుతోపాటు తెలుగులో సభలకు అందజేయబడుతున్నాయి. అనువాదం విషయంలో మాత్రం మన రాష్ట్రం అంతగా అభివృద్ధి సాధించలేదనే చెప్పాలి. ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమీషన్ అజమాయిషీలో జరిగే పరీక్షలలో తెలుగు బోధనా భాషగా చదివిన విద్యార్థులకు ఉద్యోగావకాశాలలో ప్రాధాన్యత కొనసాగాలి. బోధనాభాషగా మాతృ భాషను ఇంటర్ స్థాయిలో అమలుపరచింది ముందుగా ఆంధ్ర రాష్ట్రమే! అధికార భాషగా తెలుగు మందకొడిగా అమలు జరగటానికి కొంతకారణం తెలుగు టైపురైటర్ల సరఫరా సరిగా లేకపోవటమే! పరిభాష విషయం ఆలోచిస్తే ఒక ఇంగ్లీషు పదానికి ఒక తెలుగు పదం తెలియకపోయినా లేదా స్ఫురించక పోయినా తెలుగు వాక్యాలలో ఇంగ్లీషు మాటను తెలుగు అక్షరాలలో మొదట్లో వ్రాయవచ్చు. అలవాటు అయ్యేవరకు ఇంగ్లీషు మాటలు ఉపయోగించవచ్చు. పూర్తిగా మరుగున పడేస్తే భాష అభివృద్ధి చెందదు. ప్రతి జిల్లాలో ప్రజా బాహుళ్యపు నుడికారాలు పరిశీలన చేయవలసి ఉంది. ఇప్పటి వరకు తెలుగుభాష సాహిత్యభాషగా మాత్రమే ఉంది. బోధనా భాషగా, పరిపాలనా భాషగా ప్రవేశ పెట్టడంలో శాస్త్రీయ, సాంకేతిక, రంగాలకుకూడా సరిపడగల తెలుగు పదాలు అమలు జరుపుకోవడంలో నిత్య వ్యవహారంలో వాడుతున్న తెలుగు పదాలు జన సామాన్యంలో వాడుతున్న పదజాలం గ్రంథస్థం కావాలి. తమకు తెల్సినంతవరకు ఆయాప్రాంతాలలో వాడబడే పదాలు ఏరి కూర్చి తెలుగుభాషను ప్రజల భాషగా సంపన్నం చేయాలి.

ఆనందనామ సంవత్సరం ఉగాదినాడు అఖిలభారత తెలుగు సాంస్కృతిక మహాసభలు జరిపి తాలూకా స్థాయి

లోని అన్ని కార్యాలయాల్లో అధికార భాషగా తెలుగు ప్రకటించారు. ఇప్పుడు సచివాలయ స్థాయిలోకూడా తెలుగును అమలుపరచవలెనని ప్రయత్నాలు జరుగుతున్నాయి. కానీ అమలు విషయంలో అసంతృప్తిగానే ఉంది. ప్రభుత్వ నిర్ణయానికి ప్రజల సహకారం పూర్తిగా లభించాలి. తెలుగు అమలు పరచువారికి ప్రోత్సాహక బహుమతులు ఉండాలి. రాజకీయ బానిసత్వం వదిలినా భాషాదాస్యం వదిలించుకోలేని అసమర్థతతో బాధపడుతున్న తెలుగువాడికి తెలుగు భాష అధికారభాషగా అమలు చేయటానికి కొంత కృషి, పట్టుదల అవసరం. అది నేటి తెలుగువాడిలో లోపించినదనే చెప్పాలి. తెలుగులో కనీసం సంతకం చేయటానికి కూడా వెనుకాడే మనస్తత్వం తెలుగువాడిలో పోవాలి. త్వరలోనే ప్రజల భాషయైన తెలుగుభాష, శాసనభాషగా, పాలనాభాషగా, న్యాయస్థానాల భాషగా, ఉన్నత విద్యామాధ్యమంగా కనబడుతుందని ఆశిద్దాం. అందుకు అందరం కృషిచేద్దాం.

ఒక కవివరుడన్నట్లు—

'మరల నొకమారు వెనుకకు మరలిచూసి
దిద్దుకోవమ్మ బిడ్డల తెనుగుతల్లి !'

అని తెలుగుతల్లికి విన్నవించుకొందాం. 

# ఆదర్శం - త్యాగం

“ఈ అశాశ్వతమైన ప్రపంచంలో ప్రతిదీ మరణిస్తుంది, నశిస్తుంది. కాని ఆశయాలు, ఆదర్శాలు మాత్రం నశించవు. ఒకవ్యక్తి ఒక ఆశయంకోసం మరణించవచ్చు, ఆదర్శానికి బలి కావచ్చు. కాని అతని అనంతరం అదే ఆశయం, ఆదర్శం కొన్నివేల మనస్సులలో ప్రవేశించి రూపం దాలుస్తుంది. ఈ రీతిలో ఉత్తమ ఆకాంక్షలు ఒక తరంనుండి మరొక తరంవారికి అందజేయబడుతాయి. ప్రపంచంలో ఏ ఆశయం, ఆదర్శమూ బాధలు, యాతనలూ అనుభవించకుండా సాధించబడలేదు. ఒక సిద్ధాంతం కొరకు, ఒక ఆశయం కొరకు, ఆదర్శం కొరకు జీవితాన్ని అర్పించి అవసరమైతే మరణించడంలో నున్న ఆనందం ఇంకెందులో నున్నది? తన అనంతరం, తన ఆత్మ అనేకమంది మనస్సులలో ప్రవేశించి, వారిని ఉత్తేజ పరచి, తాను అసంపూర్తిగా వదలివేసిన పనిని వారిచేత చేయిస్తుందనే సంతృప్తి కంటే మిన్నయైన సంతృప్తి ఎందులో వున్నది ?

బాధల నెదుర్కోవడం వలన, త్యాగం చేయడంవలన ఎవడూ ఏమీ కోల్పోడు. భూమిమీద అతడేదైనా కోల్పోయినట్లయితే, నశించనటువంటి కీర్తికి అతడు వారసుడు కావడంద్వారా పోగొట్టుకొనిన దానికంటె అధికంగా మరల పొందుతున్నాడు.

జాతి జీవించడం కొరకు వ్యక్తి త్యాగం చేసితీరాలి. జాతి అభివృద్ధి గాంచుటకు వ్యక్తి కృషి చేయాలి. అవసరమైతే సర్వస్వాన్ని అర్పించాలి. మరణించడానికి కూడా వెనుకాడరాదు. ఈనాడు నేను మరణిస్తాను, అందుమూలాన భారతదేశం జీవిస్తుంది. స్వతంత్రాన్ని, ఘనతను పొందుతుంది.”

— నేతాజీ సుభాస్‌చంద్రబోస్

# పాత్రికేయ హాస్యం

**అ**చ్చుయంత్రం వచ్చాక ఆటోమాటిక్ హాస్యం పుట్టిందన్నమాట అతిశయోక్తి కాదేమో! అది అందించే అచ్చు తప్పులు అంతటి ఆనందసంధాయకాలు కాబట్టి- ఈ అప్పుతచ్చుల్ని దృష్టిలో పెట్టుకొనే ఆరుద్రగారు అప్పుడప్పుడు పాఠక మహాశనులతో (అప్పు తచ్చు క్షమించాలి!) పాఠక మహాశయులతో "బాతాఖానీ" చేస్తూంటారు.

గతంలో దొర్లిన అచ్చుతప్పుల్లో మచ్చుకు కొన్ని తలుచుకొన్నప్పుడల్లా మనల్ని నవ్విస్తూంటాయి. ఓసారి తాపీ ధర్మారావుగార్ని గురించి రాస్తూ "ఈయన ఆంధ్ర దేశానికి టాగూర్ వంటివాడు" అనిరాస్తే అది అచ్చులో "వంటవాడు" గా కంపోజ్ అయి అచ్చయిపోయిందట. పాపం! విశ్వకవి అచ్చుయంత్రం చేతిలో వంటవాడై పోయాడు. అలాగే సన్నకారు రైతులకు పరపతి సౌకర్యాలు అన్న శీర్షికలో "పతి"లో "ప" బదులు "స" పడింది అదికాస్త పరసతి సౌకర్యమైంది. అసలే సన్నకారురైతులు ఇది మరీ అసౌకర్యమేమరి! "క్షామపీడిత ప్రాంతాల్లో సత్వరచర్యలు" అన్న శీర్షికలో "క" కింద "ష" వత్తు పడలేదు. ఇది కామపీడిత ప్రాంతాల్లో సత్వరచర్య అయింది. ఇంతవరకూ ఏం ఫరవాలేదు. కొన్నితప్పులు కొంపలు ముంచుతాయి. ఆరోజుల్లో శ్రీ ఫలానాగారు అని రాస్తూండేవారట. ఓ సుబ్బారావుగార్ని శ్రీ సుబ్బారావు అని రాస్తే అది శ్రీసుబ్బారావుగాడుఅని అచ్చయిందట, గారును గాడు చేసేసరికి సుబ్బారావుకు కోపంవచ్చింది.! ఆ పత్రిక మీద అతగాడు ధ్వజమెత్తాడట. అప్పట్నుంచి శ్రీ ఉంటే గారక్కర్లేదనే రూలొచ్చి పడిందని ఈ. పిట్టకథ ప్రచారంలో ఉంది.

ఇంకోసారి ఓ సెక్సుతార "జయభ్రమ" కి విమానంలోనే మేకప్పు గట్రా చెయ్యాల్సొచ్చిందట. సదరు తారామణికి మేకప్ విమానంలోనే జరగటంతో అది వార్తయి ఓవార్తాపత్రికకు ఎక్కింది. ఎక్కేటప్పుడు ఓ తిరకాసు జరిగింది. "జయభ్రమకి విమానంలో మేకప్" అనే శీర్షికలో "వి" సరిగా ప్రెస్ కాకనో, వీక్లీకుట్టు లోకి పోయిందో మిగిలిన అక్షరాలు కలవర పెట్టాయి. ఈ అచ్చు పొరపాట్లు అప్పుడప్పుడు జరిగిపోతూనే ఉంటాయ్. ఏ పొరపాటుకి చింతించినా ఈ పొరపాట్లుకి పత్రికలవాళ్ళు సాధారణంగా చింతించరు. బహుశా ఈ చింతా ప్రకటనలో కూడా మరికొన్ని అచ్చు తప్పులుంటాయేమోనని కావచ్చు.




మన ప్రాంతీయ పత్రికల్లో హడావుడిగా ఇంగ్లీష్‌లో వచ్చేవార్తల్ని తెలుగు చేయాల్సి ఉంటుంది. ఈ హడావుడి అనువాదాల్లో, అనాలోచితంగా రాసే రాతల్లోకూడా హాస్యం ఆటోమాటిక్కే! ఓ తెలుగు పత్రిక శాసనమండలి వ్యవహారాలకు సంబంధించిన "బిజినెస్ ఎడ్వయిజరీ కమిటీని" వ్యాపారసలహా సంఘంగా అనువదించిందట, బ్రిటీష్ విలేఖరిణి ఎలిజబెత్ హైదరాబాద్‌వచ్చిన వార్తా విషయం "శ్రీ ఎలిజబెత్" అని పదేపదే ప్రస్తావించడంతో లింగభేదం గమనించని సబ్ ఎడిటర్‌గారి అజ్ఞానం బయట పడిపోయింది.

రాజకీయనాయకుల్ని పత్రికా విలేఖరులు నానా ప్రశ్నలతో నానా తికమకలు పెడుతుంటారు. కొందరు చిరునవ్వుల్తో సమయస్ఫూర్తితో సమాధానాలిస్తే మరి

## మినీ కవిత

'చక్కని కథా చిక్కని శైలీ లేదు'
చప్పరించింది పెదవి పురాణ కవిత.
'వర్ణనలూ అలంకారాలు లేవు'
వెక్కిరించింది ప్రబంధ కవిత.
'గీత మాధురీ నాద సంపదా లేదు'
గేలి చేసింది భావ కవిత.
'ఊహా లేదు ఉద్రేకం లేదు'
వా పోయింది విప్లవ కవిత.
'నిజమే నిజమే యివన్నీ లేవు నాలో
సూటిగా ఎదలోకి చొచ్చుకు పోతాను
సూదిలా
హృదయాకాశంలో తిరుగుతాను మేఘంలా
చాలనుకుంటాను...
మంచి మనిషికో మాట'
అంది గడుసుగా మినీ కవిత.

- చల్లా రాధాకృష్ణశర్మ

కొందరు ఆవేశ కావేశాలకుపోయి లేనిపోని గాడిదబరువు నెత్తి నేసుకొంటారు. ఇటీవల ఓ మంత్రిగారు జర్నలిస్టుల్ని "గాడిద కొడుకులు" అనేసరికి పెద్ద గొడవైపోయిందిగదా!— 1936 ప్రాంతాల్లో అవిభక్త మద్రాసు రాష్ట్రంలో ఎక్కడబడితే అక్కడ కాంగ్రెస్‌వారు పదవీ బాధ్యతలు స్వీకరిస్తారా? లేదా! అనే విషయంమీద బాగా చర్చలు జరుగుతుండేవి. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు అదేసమయంలో మద్రాసు సెంట్రల్ స్టేషన్లో దిగారు. అది తెలిసి విలేకర్లు ఆయన్ను చుట్టుముట్టి ఈ విషయంలో ఆయన అభిప్రాయం రాబట్టటానికి ప్రశ్నలు గురిపెట్టారు. ఆయన సమయ స్ఫూర్తితో "ఇప్పుడు నాకు కావాల్సింది పోర్టరుగాని రిపోర్టరుకాదు"- అని వాళ్ళ నోళ్ళు మూయించారట.

కొన్ని పత్రికల్లో "ప్రశ్నలూ-సమాధానాలు" శీర్షికలుంటాయి. కొన్ని శీర్షికలు సమాధానం చెప్పేవారి పేరుతో- మరికొన్ని పేరుచెప్పకుండా నిర్వహిస్తుంటారు. ఓ పత్రికలో పేరు చెప్పేవారిని ఆడో మగో తెలుసుకోడానికే సగానికి సగం పైగా పశ్నపరంపర. సరదాకి ఓ ప్రశ్న!- మీరు "బ్రా" వాడతారా? బనీనువాడతారా? జవాబు:- రెండూకాదు.... ఇదిచదివిన మా మిత్రుడు వీళ్ళంతా ఎందుకు ఇలా అడుగుతున్నారో. నా కర్థం కావడంలేదు. తెలియడల్లా వాడురెండూ కాదన్నాడు కోపంగా.

ఓ ప్రముఖ రచయితచేత ప్రశ్నలకు సమాధానాలిప్పించే ఉద్దేశంతో ఓ పత్రికవారు కొన్ని ప్రశ్నలూ జవాబులూ కూడా "ప్రస్తుతానికి మీరే చమత్కారంగా రాసిపంపండి" అని ఉత్తరం రాసేసరికి ఆ రచయిత కారాలు మిరియాలూ నూరుతూ ఆ అసహ్యమైన పని చెయ్యలేనని సమాధానం ఇచ్చాడట.

పత్రికల్లో వారఫలాలు, దినఫలాలు కూడా హాస్య వృద్ధికి టానిక్కులే. ప్రతి యింట్లో నమ్మినా, నమ్మకపోయినా చదువుకొని సరదాపడిపోవడం మన అనుభవ సత్యమే! వారఫలాల్లో "సూక్తి ముక్తావళి" కార్యక్రమంకూడా అంతర్గతంగా ఉంటుంది. "కష్టాలు మనిషికి కాక మానుకొస్తాయా అని మీరు ధైర్యంగాఉండాలి" లాంటి ఉపదేశాలతో "రాశి" నింపి హాస్యవాసిచూపిస్తారు.

ఓసారి గ్రహబలం చాలకో, పోస్టల్ డిలేనోగాని "వారఫలాలు" సకాలంలో ఓ వారపత్రికకి అందలేదట. సదరు పత్రికాధిపతులవారు పాతవి తిరగేసి ఏదో పూర్తిచేసి అయిందనిపించారు. అది తెలిసిన దైవజ్ఞుడు మండిపడుతూ ఉత్తరావేశం (ఉత్తరంలో) ప్రదర్శించాడట.

ఇంతకీ చెప్పొచ్చే దేమిటంటే హాస్యం ఎందెందు వెదకి చూచిన అందందేగలదు పత్రికల్లో సైతం!- ★

హాస్యాత్మక చిత్రం :

# కోన్‌కిస్కాహే గాడి అడ్డాలో వున్నానా?

# మధురవాణి స్వగతం

అబ్బో, అబ్బో, తెలుగుదేశం ఎంత తెలివి మీరిపోయింది! అవి బట్టలా, అవి సినిమాలా! గిరీశంగారి దగ్గిర కొంచెం ఇంగ్లీషు నేర్చుకోబట్టి సరిపోయింది గానీ లేకపోతే ఈ దేశం అర్థమయ్యేదా నాకు? నైలాన్‌లట, షిఫాన్‌లట, జార్జెట్‌లట, మాచింగ్ బ్లౌజ్‌లట! ఇవి ఆ రోజుల్లో మేమే కట్టుకొంటే దేవతా వస్త్రాలు అనేవారు. ఇలా రోజుకొక కొత్త సినిమా చూస్తూవుంటే మా జాతినే నిందించేవారేమో. ఇంతకూ నన్ను గుర్తుపట్టారా లేదా? పేరు మధురవాణి, ఊరు విజయనగరం. మా గురువుగారు అప్పారాయ కవీంద్రులు చేసిన సృష్టిని. మధురవాణి అంటూ ఒక వేశ్యా శిఖామణి ఈ కళింగరాజ్యంలో వుండకపోతే భగవంతుడి సృష్టికే లోపంవచ్చి వుండును అన్నారు మా నాటకం ప్రశస్తి తెలిసిన దేవభాష పండితులు.

అయినా నాకు తెలియక అడుగుతాను, మంచంకింద నాటకానికి నేనా బాధ్యురాల్ని చెప్పండి. గిరీశంగారు నన్ను చూడలేంది వుండలేక పోయేవారు. నన్ను ఎప్పుడూ మైడియర్ ఎంప్రెస్ అని సంబోధించే వారు. అంత గట్టి లవర్‌ని నేను మరి చూడలేదు. ఊరొదిలిపోతూ నాకు పార్టింగ్ విజిట్ ఇవ్వాలని ఇంటికి వచ్చారు. అంతకు ముందే రామప్పంతులు వచ్చి తన ప్రతాపంగూర్చి చెబుతూ బుగ్గగిల్లితే నేను ఒల్లలేదు. గిరీశంగారు ఎంత తెలిసిన వారు! ఏమి ప్రఖ్యాతి గలవారు! పంతులు రామచంద్రాపురం అగ్రహారం కరణమైతే మాత్రం, గిరీశంగారితో నాకు తెగతెంపులు జరగొద్దా? వేళగాని వేళ గిరీశంగారు రానే వచ్చారు. తంతారేమోనని పంతులుకి ముచ్చెమటలు పోసి మంచంకింద దూరాడు. పంతులికి అసలే దెబ్బంటే భయం. గిరీశంగారిని తరుముకుంటూ చీపురుకట్టతో పూటకూళ్ళమ్మ వచ్చింది. ఇక చీపురుకట్ట సరసం మొదలైంది. గిరీశంగారైతే తప్పించుకున్నారుగాని పంతులుగారికి మాత్రం దేహశుద్ధి జరిగింది.

డి. రామలింగం

మరి గిరీశంగారిని వదిలి ఈ పంతులుతో ఎందుకు లేచిపొయ్యొచ్చానంటారా! ఆయనకు ఎప్పుడూ డబ్బుకి యటా ముటేగా వుండేది కాని ఈ రామప్పంతులు ఉన్నాడే, పైన పటారం లోపల లొటారం. భూములన్నీ తాకట్టులో పడ్డాయి. రుణాలు పుట్టవు. వాళ్ళకీ వీళ్ళకీ జుట్టు ముడేసి జీవనం చేసేవాడు. పెళ్ళాం పిల్లలు నాస్తి. పైగా తనకు పెద్ద సత్తువవుందని బడాయిలు చెబుతాడు. దెబ్బ మాట్టెత్తితే ఆడదానికన్నా అన్యాయం. ఒక నిర్ణయంమీద నిలవని మనిషి. దుష్టుమాటలు మాట్లాడతాడు. పైగా వట్టి అనుమానం మనిషి. పట్నంలో పెరిగినదాన్ని కాబట్టి ఎవరితోనో ఒకరితో మాట్లాడితేగాని నాకు పొద్దుపోదట. మాటా పలుకు లేకుండా ఎవరుంటారు చెప్పండి. అందులోనూ మా మాటలే కదా సరసులికి రస గుళికలు. మా జాతి వాళ్ళకి మాటా—మంత్రీ, సరసం, విరసం, కోపం, అలక, అవసరం లేకపోయినా విరగబడి నవ్వడం, పెంకె మాటలు, పెడర్థాలు, వేషాలు, ఎకసక్కాలు, ఎవగింపులు, దువ్వడాలు, దుమ్ము దులపడాలు, దూరడాలు, ఎన్ని హావ భావాలు, ఎంత నటన ఉండాలి! కోన్‌కిస్కాహే గాడిఅడ్డాలో వున్నానని నన్ను దెప్పి పొడిచాడు ఈ రామప్పంతులు.

వీడి అడాలో మాత్రం వున్నానా ? పైగా నేను పెళ్ళిలో ఎవరెవరితో మాట్లాడానో అని ఆరాలు తీశాడు కొండిభొట్లు దగ్గర ! దొడ్డితోవంట కనిస్టేబులుగానీ, మరెవరైనా వచ్చారేమో కనిపెట్టమని లంచం ఇచ్చి వాణ్ణి నియోగించాడు. ఈ నియోగపాడు మనిషిని నమ్మతాడా ? అయినా హెడ్డు నాతో వ్యవహారం లో కాభిరామాయణం, అచ్చటాముచ్చటా మాట్లాడడానికి ఎప్పుడొచ్చినా దొడ్డితోవంటే వస్తాడు. వాడు నాకు గులాం. ఏదైనా జట్టీవస్తే కాచేవాడు. పంతుల్ని పిలక పట్టుకొని గోళ్లూడగొట్టినట్టు నాలుగురాళ్ళూ అక్కడ పెట్టమన్నాడా ? హెడ్డూ నేనూ ఒహరిమీద ఒహరం విరగబడి నవ్వుకొనే వాళ్ళం. అంతమాత్రానికే ఏం తీపు తీసింది. అయినా ఎరక్క అడుగుతానుగాని నాకు అన్ని జట్టీలు కాచినవాణ్ణి సంతోషపెట్టడం నా ధర్మం కాదా ? అంతటితోనే పాతివ్రత్యం పోయిందా ? పూటకూళ్ళమ్మ. మీనాక్షి ఏమంత పెద్ద పతివ్రతట ? పాపం పెద్దాయన లుబ్ధావధానులు నన్ను ముద్దుగా 'మధురం' అని పిలిచినా బుద్ధికి జాకాల్, తెలివికి యాస్ అయిన ఈ రామప్ప పంతులు ఓర్వలేకపోయాడు. నాలో వెర్రి మొర్రి చేష్టలు చేస్తే తనకూ ఆయనకూ చెడుతుందని వీడి వెధవ వెదిరింపూనూ. కాని శభాష్, లుబ్ధావధానులు మంచిమాట అడిగాడు ! మనిషికీ మనిషికీ తారతమ్యం సానిదే కనిపెట్టాలి కదండీ అన్నాడు. నన్ను బుద్ధిమంతురాలు, నిజం కనిపెడుతుందని మెచ్చుకున్నాడు. ఈ పంతులు ఆ బోరు ఏ పాటోగాని ప్రతివాడూ ఏకవచన ప్రయోగం చేసేవాడే? వీడి బ్రతుక్కి ఏకవచనం, బహువచనం అని ఊరకే కొష్టవాదం పెట్టుకొంటాడు. కాస్త చెయిముట్టు సరసానికైనా ఓర్చలేడు. కామశాస్త్రంలో కాముకులపై మాకు చిరుకోపం వచ్చినట్టాయనా జడతో కొట్టమన్నారు కదా. అదికూడా ఈ పంతులుకు సరిపడదు ! ఇక ఏం సరసుడు వీడు ! ఛీ పరిస్థితుల వత్తిడి అలావొచ్చి నేను వీడిని ఆశ్రయింపవలసి వచ్చింది. అయినా మూడు చెరువుల నీళ్ళు తాగించి చవటను చేశాను.

ఆ కరటకశాస్త్రులు నాటకాల కంపెనీలో విదూషకుడు మాత్రమే కాదు. మాలావు సైకోఫాంట్. నేను త్రిలోక సుందరిని అన్నాడు. నా యవ్వనం, శృంగారం అంతా దేవతాస్త్రీలకువలె శాశ్వతం అన్నాడు - అన్నీ పైపైకి అనే మాటలే. కాని లోపల ఎంతకపటి ! గిరీశంగారు నన్ను వుంచుకున్నారనీ, కాబట్టి ఆయనకు తన చెల్లెలి ఇంట అడుగు పెట్టడానికి యోగ్యతలేదనీ, వెంటనే ఆయనకు ఉద్వాసన చెప్పాలని అన్నాడుకదా ! కాని ఈ పండితమ్మన్యులు కార్యావసరం కలిగితే మధురవాణి దగ్గర లాచారీ పడతారు. పోనీ కరటకశాస్త్రి తానేం అన్నాడు ? నన్ను ముద్దెట్టుకోమన్నప్పుడల్లా ముద్దెట్టుకోవాలని అతగాడి శిష్యుడితో నేను అంటే, అతను ఆ శిష్యరికం ఏదో వాడి తరఫునా తన తరఫునా తానే చేయడానికి సిద్ధపడ్డాడు. నువ్వు శిష్యుడివి కావాలంటే ఇస్కూలు జీతం ఇచ్చుకోవాలని ఒక తస్నా వేశాను. చిత్రం, ఈ బ్రాహ్మలు ఎంతకైనా తగుదురు ! నన్ను చూడ్డమే బ్రహ్మానందం అన్నాడా ! ఆనందోబ్రహ్మ అన్న పెద్దన గారిని వీడు కాపీ కొట్టేసి ఉండాలి. పెద్దనగారు ఎంత పెద్దమనిషి. మా జాతి స్త్రీరత్నమైన వరూధినిని ఎంత అపురూపంగా సృష్టించాడు! దాని పొందుకోరని వాడు ఏం మగాడు ? అటువంటిది ఈ కరటకశాస్త్రి డిప్టీ కలెక్టరుగారి కుమారరత్నం నన్ను చేపట్టారని అతడి తండ్రికి తెలిసిం తర్వాత అతను నా ఇంటి చాయలకువస్తే తన పీక ఉత్తరిస్తాడని నా ఇంటికి రావడం మానివేశాడు. పైగా రావడం చేదా, తియ్యకాదా అని కబుర్లు చెప్తాడు ! నా దగ్గరికి వచ్చినవాడల్లా చెడిపోయినవాడే అనే నిర్ణయానికి వచ్చినవాడు, నా దగ్గరికి తాను రాకుండా అవరోధం కలిగిందని డిప్టీ కలెక్టర్ని దుర్భాషలాడాడు ! ఆయనకంటే ఈ విదూషకుడి న్యాయం ఏం బాగుంది ? తనకు రొట్టా, ఒహడికి ముక్కానా ? అందుకనే ఈ

చీవాట్లు పెట్టాను. లేకపోతే తామేమో కన్యాశుల్కమని ఆడపిల్లల్ని పెళ్ళిళ్ళకి అమ్ముకొని, మేం డబ్బుకోసం వ్యభిచారం చేస్తామని మాపై నింద వేస్తారూ ? నేను డబ్బు మనిషినేనా ? మెప్పు కోరాను. అదీ దొరకలేదు వీళ్ళ దగ్గిర సరిగా !

"సత్యం అన్నిటికంటే ఉత్తమమైన నీతి. మరే ఇతర మార్గాలద్వారా దేశానికి మేలు చేకూర్చలేము. సత్యాన్ని పాలించడం అగ్నిపరీక్ష వంటిది. బంగారం తేటు తేరాలంటే అగ్నిలో మండిస్తాము. సత్య పరీక్షకూడా ఇట్టిదే".

— బాలగంగాధరతిలక్

ఇక సౌజన్యారావు పంతులున్నాడు. మనిషి చెడు బుద్ధులు లేనివాడే కాని, మా పెద్ద యాంటీనాచీ. వేశ్యలను పాటలకు పిలవకపోతే వాళ్ళు బ్రతకడం ఎలాగండీ అని అడిగితే పెళ్ళిళ్ళు చేసుకోండన్నాడు! వేశ్య శరీరం తగిలితేనే శరీరం కోసేసుకుంటాడట? ఈయన శిబి చక్రవర్తా? సాని దానికి మంచితో పని పుండదంటాడు. వేశ్య డబ్బొల్లకపోదని ఆయన గాఢ విశ్వాసం. వేశ్యలు దేవాలయాల్లోకి భగవంతుని చూడటానికి పోవచ్చుగాని సత్పురుషుల దర్శనం చేయకూడదట! చివరకు వ్రతభంగం చేసుకొని నన్ను పుద్దెట్టుకోడానికి సిద్ధపడ్డాడు. నేనే వారించి అంతటితో కథ ముగించాను. మా అమ్మ మంచివారి ఎడల మంచిగానూ, చెడ్డవారి ఎడల చెడ్డగానూ ఉండమని ఉపదేశం చేసిపుంది కదా! కాని మా జాతికి ఒక నీతిపుంది. బ్రతుకనేదిపుంటే వలపు వన్నె తెలుస్తుంది. అంగడివాడికి మిఠాయిమీద ఆశా, సాని దానికి వలపూ మనస్సులోనే మణగాలని అమ్మ చెప్పింది. కొద్ది కాలంపుండే యౌవనాన్ని జీవనాధారం చేసుకున్న మా కులానికి వలపు ఒక్కచోటే—బంగారపు సరుకుమీద. శృంగారం వన్నె చెడిన దగ్గర్నుంచీ బంగారంకదా తేటు తేవాలి? స్నేహం, వలపూ అంటూ పాతాలు వల్లిస్తారు ఈ విటులు పబ్బం గడుపుకోవడానికి. వెధవల్ని కనిపెట్టి ఉండాలి. ఎదుట ముఖస్తుతీ, మనిషి మరుగైతే దూషణలు! ఈ గిరీశం వెధవాయ నన్ను, కొండొకచో బ్యూటిఫుల్ నాచ్ డెవిల్ అన్నాడు. వాడు ఫూలిష్ యంగ్‌మాన్ కాదూ? బోటిబ్ప కాదూ? అయితే ఆయన్ని ఏమి అనడానికైనా జంకేస్తుంది. నాకెంత ఆనందమిచ్చారు! ఆ నాటకంలో ఆయనేలేకపోతే నేనెక్కడుంటాను. ఏ మాటకు ఆ మాటే, రంజింపజేసే సరసుడు గిరీశంగారు. నేషనల్ కాంగ్రెస్ నాయకులు ఆయనగారి నేస్తాలు. లెక్చర్లివ్వడంలో బంగాళీ వాళ్ళనే చిత్తు చేసేవారు.

నిజం చెప్పాలంటే నా దగ్గరి కొచ్చిన ప్రతి మగ కుక్కా కుక్కకున్న విశ్వాసంకూడా లేనివాడు. డిప్టీ కలక్టరుకూడా సీమకుక్కే. స్త్రీ వ్యసనం లావు. నాయుడు చేత రాయబారాలు పంపాడు నాకు. హెడ్డు ఒక్కడే నయం. అతన్ని నౌఖరులా తిప్పుకున్నానుగాని అధికం లేదే. సర్కారు కొలువు అవతల పుంచి నా కొలువు చేశాడు. కాని తక్కినవాళ్ళు ఫౌజు ఫౌజంతా మాటల్లో మహావీరులే. ఇంగ్లీషు చదువుకున్న వాళ్ళకి కొందరికి పట్టుకుంది ఈ యాంటీనాచీ చాదస్తం. సోషల్ రిఫారమ్ అని గావుకేకలు వేస్తారు. కాని కొందరు బంట్లు పగలు యాంటీనాచీ, రాత్రి ప్రోనాచీ. శరీరధార్ఢ్యం వున్నంత కాలం ప్రోనాచీ, శరీరం చెడ్డ తర్వాత యాంటీనాచీ, అంటే యజ్ఞంచేసి పరలోకాల భోగాలకి టిక్కెట్టు కొనుక్కుంటారు. కరటకశాస్త్రి లాంటి అల్పులు. లభ్యం కానప్పుడల్లా యాంటీనాచే. గిరీశంగారు చేసే దొహటీ, చెప్పేదొకటీనూ. మా అమ్మ చెవిలో గూడు కట్టుకొని బుద్ధులు చెప్పబట్టి కాని, లేకపోతే విటగాయక వైతండిక నటజనుల ఇచ్చకాలకి మైమరచి ఈపాటికి ఊళ్ళో సానుల వలె చెడివుండనో! నిజం చెప్పాలంటే నేను ఎవడికీ మనసివ్వలేదు! ఏదో జీవించాను అంతే. అంతా నటన.

ఇప్పుడు చెప్పండి, నేను ఏ కోన్ కిస్కా హే గాడి అడాలో పున్నానో? మా గురువుగారి పాదాల ప్రమాణంగా, పట్టాభి రామస్వామి ప్రమాణంగా చెబుతున్నాను, ఆయన నన్ను వసంతసేనకన్న అత్యంత స్వతంత్రజీవిగా సృష్టించి మా జాతికి వన్నె తెచ్చారు. సౌజన్యారావుగారిని నాచ్ వలలో పడకుండా తప్పించానని ఆయనచేత నాకు షేక్‌హాండ్ ఇప్పించారు. అదెంత కాదు? ★

# చిత్తశుద్ధి భిప్రాయాలా కవుల రాజకీయాలా

ఈ సమాజాన్ని సమసమాజంగా చూడాలనే ఉద్దేశంతో చాలమంది కవులు కవిత్వం రాస్తున్నారు. కొందరు కవులు సంస్కరణ వాదులు, మరికొందరు మతవాదులు, మరి కొందరు అతివాదులు, ఇంకా మరికొందరు హత్యల తోనే సమసమాజం వస్తుందని నమ్మే అత్యుగ్రవాదులు. అన్నిటికన్నా ముఖ్యమైన దొకటుంది. కవి తాను నమ్మిన దానిని (చిత్తశుద్ధిగా) కవిత్వంగా రాసినపుడు మాత్రమే అది శక్తిమంతంగా తయారై ప్రజల్ని ఆకర్షిస్తుంది.

**కవియుగరాజకీయాలు**
**రావి రంగారావు**

ఏదో నలుగురి మెప్పు పొందటంకోసం నమ్మని అభిప్రాయాలను కవిత్వంలో తాను నమ్ముతున్నట్లు రాస్తే ఆ కవితలు పేలవంగా తయారౌతాయి. ఇలా పేలవంగా కవిత్వం రాస్తున్నామని గుర్తించిన కొందరిలో కొందరు ఒక కొత్త "టెక్నిక్" కనిపెట్టినట్లు తోస్తోంది. అదే మంటే కవిత్వంలో కల్తీ "ఇమేజరీ" సృష్టించి పాఠకులకు అర్థం కాకుండాచేసి తమ కవిత్వం చాలా శక్తివంతమైనదని, ఆలోచించే జీవులకు తప్ప సామాన్యులకు అర్థంకాదని అంటుంటారు. రాజుగారు దేవతా వస్త్రాలతో మెరిసిపోతున్నారని మూర్ఖప్రజలు అనుకున్నట్లుగా కొందరు ఆధునిక విమర్శకులు అదే ఉత్తమ కవిత్వమని వంతపాట పాడుతున్నారు.

"ఒక చెట్టు
పొగ మంచులో నుంచి
అస్పష్టంగా
గోచరిస్తున్నప్పుడు
విడి సమయాల్లో కంటె
ఎక్కువ సుందరంగా ఉంటుంది"

అంటారు సంజీవదేవ్. ఇలాంటి అస్పష్టత క్రమంగా ఆలోచించగలవాడికి ఆనందాన్నే కలిగిస్తుంది. ఈ నిర్మాణాత్మకమైన అస్పష్టతను సృజించలేక-'ఇమేజరీ'ని తెగ్గొట్టి, మళ్ళీ ముడివేసి, మళ్ళీ తెగ్గొట్టి, మళ్ళీ ముడులువేస్తూ అసలైన కవిత్వం తమదనే వాళ్ళతోనే పేచీ. "కంటిన్యుటీ ఆఫ్ ఇమేజరీ" ఉన్న కవితలు ఆలోచిస్తుంటే ఆపాతమధురంగా, చైతన్యం కలిగిస్తూ ఉంటాయి. అలాకాక ఒకో లైనులో ఒకో ఇమేజరీ కల్పించి, ఒకే కవితలోనే అనుసంధానం లేకుండా చేసి ఇదే గొప్పకవిత్వమంటారు వాళ్ళు. అందుకు కారణం చిత్తశుద్ధిగా నమ్మిన భావాలు అందులో లేకపోవడమే.

"ఆశయాన్ని
చెరకు విల్లుగా మార్చి
ఆలోచనను
అల్లె త్రాడుగా కూర్చి
కవితల్ని
పూల బాణాలుగా పేర్చి
నీ గుండెకేసి సంధిస్తున్నా,

సుప్ ప్రేమించక తప్పదు
సమ సమాజ సుందరిని ”

ఆశయం, ఆలోచన కలిసిన కవి మంచికవిత్వం రాస్తాడు. కాని ఆశయం, ఆలోచనతో పాటు ఆచరణకూడా కలసిన కవి రాసే కవిత నిస్సందేహంగా ఉత్తమ కవిత, తిరుగులేని మహాకవిత. చెరబండరాజు ఇలా అంటాడు.

“ పోరాటం
డైరెక్షన్
పాట నాకు
ఆక్సిజన్,
ముంజేతిని
ఖండించిన
నా పిగికిటి
కత్తి వదల,
ఉరితాటికి
పాట నేర్పి
పల్లవి నే .
పాడిసా ”

జాషువా కూడా చిత్తశుద్ధిగా నమ్మిన అభిప్రాయాలు వ్రాసిన కవి.

“ ప్రతిమల పెండ్లి చేయుటకు
వందలు వేలు వ్యయించుగాని దుః
ఖితమతులైన పేదల పకీరుల
హాన్యములైన పాత్రలన్
మెతుకు విదల్పదీ భరత మేదిని
ముప్పదిమూడుకోట్ల దే
వత లెగబడ్డ దేశమున
భాగ్య విహీనుల క్షుత్తులారునే ”

అలాగే కృష్ణశాస్త్రి కవిత్వం మనకు నచ్చటానికి కారణం అందులోని భావాలు ఆయన చిత్తశుద్ధిగా నమ్మి రాయాలని పించి రాయటమే.

దేశ రాజకీయాలలోను కవుల రాజకీయాలలోను చిత్తశుద్ధి ఎంత శాతం ఉందో ప్రజలు గమనిస్తూనే ఉ టారనేది శాశ్వత సత్యం. ★

# గోముఖాసనము

దావులూరి రాధాకృష్ణమూర్తి



గోవు ముఖంలాగ వుండే ఆసనం కాబట్టి గోముఖాసనము అంటారు. కూర్చునిచేసే ఆసనములలో ముఖ్యమయినది, చాలా ఉపయోగకరమైనది ఈ గోముఖాసనము. స్త్రీ పురుషు లిరువురికి మంచి ఆసనము, ముఖ్యంగా యుక్త వయసులోని స్త్రీలకు మంచి ఆసనము.

సవ్యే దక్షిణ గుల్ఫంతు పృష్ఠ పార్శ్వే నియోజయేత్
దక్షిణేపి తథా సవ్యం గోముఖం గోముఖాకృతిః

ఎడమకాలి మడిమ కుడి వీపు ప్రక్కగాను, కుడికాలి మడిమ ఎడమవీపు ప్రక్కగాను (అనగా కటి ప్రదేశమునకు క్రిందుగను) మోకాలిమీద మోకాలు వుంచుతు చేసే ఆసనమును గోముఖాసనము అంటారు.

స్థూలకాయులైన వారికి ఈ ఆసనము చేయుట మొదట్లో కష్టముగా వున్ననూ అభ్యాసముమీద తేలికగా చేయ వచ్చును.

చేయు విధానము :

రెండు కాళ్ళు ముందుకు జాపి యోగస్థితిలో వుండుట ముందుగా గమనించదగినది.

1. కుడికాలును మోకాలి దగ్గర వంచుతూ, కుడి పాదముయొక్క మడమను ఎడమ పిరుదుల క్రింద వుంచవలెను.

2. ఎడమకాలును మోకాలిదగ్గర వంచుతూ, ఎడమ కాలి మడమను కుడి పిరుదుల ప్రక్కన, తాకుతూ వుంచవలెను.

3. కుడిచేతిని వెనుకకు త్రిప్పి వంచుతూ, వెన్నుపాముపై మెడ క్రింద భాగమున వుంచవలెను.

4. ఎడమచేయిని ఎత్తి తల వెనుక ప్రక్కనుండి వంచుతూ కుడిచేతి వ్రేళ్ళను ఎడమచేయి వ్రేళ్ళతో పట్టుకొనవలెను.

5. తల వెనుక ప్రక్కన వున్న ఎడమచేతిని నెమ్మదిగా విడిపించవలెను.

6. వెన్నుపాముపై (వీపుమీద) వున్న కుడిచేతిని నెమ్మదిగా విడిపించవలయును.

7. ఎడమ కాలును నెమ్మదిగా విడిపించి ముందుకు చాపి వుంచవలెను.

8. కుడికాలునుకూడ విడిపించి ముందుకు చాపి వుంచవలెను. (యోగస్థితికి వచ్చుట.)

రెండు కాళ్ళను మడిచి; రెండు చేతులను ఒకదానితో ఒకటి కలిపి పట్టుకొన్న తరువాత శరీరమును అటూ ఇటూ త్రిప్పకూడదు. కాలి మడమల వద్దగాని, రొమ్ముల వద్ద గానీ, వెన్నుపామును నడుముల వద్దగాని వంచకుండా నిటారుగా కూర్చుని వుండవలెను. నెమ్మదిగా శ్వాస పీల్చుట వదలుట చేయవలెను. దృష్టిని నాసికాగ్రమున వుంచి కండ్లుమూసి వుంచవలెను.

ఇదే మారిగిగా ఎడమకాలుతో మొదలుపెట్టి ఆసన మును మరల చేయవలయును.

ఎడమకాలు క్రింద వున్నప్పుడు ఎడమచేయి వీపుపైన, కుడిచేయిపైన వుండును. కుడికాలు క్రింద వున్నప్పుడు కుడిచేయి వీపుమీద, ఎడమచేయి పైన వుండును.

ఈ ఆసనము చేయడంవల్ల కాళ్ళలోని అనేక రకముల నొప్పులు, సయాటికా నొప్పులు, మూలశంఖ, తొడలు పిక్కలలోని బలహీనతలు, అజీర్ణము, నిద్రలేమి, వెన్ను పాములోనూ, పిరుదులలోనూ గల నొప్పులు ముంజేతుల లోని, మణికట్టులోని నొప్పులు తొలగిపోవును. చేతులను వీపుమీద వుంచకుండా రెండు కాళ్ళను ముందుగా చెప్పి నట్లు ఏర్పాటు చేసికొని ఆసనములో కూర్చుని ప్రాణా యామము అభ్యసింపవచ్చును. ధ్యానము చేసికొనుటకు ఈ ఆసనము చాలా ఉపయోగపడును.

ధౌతి, నౌళి మొదలగు క్రియలు నేర్వదలచుకొన్న వారికి ఈ ఆసనము బాగుగా ఉపయోగపడును.

యుక్తవయసు ఆడపిల్లలచే ఈ ఆసనము చేయించిన చక్కని శరీర సౌష్టవము ఏర్పడును. చక్కని ముఖ వర్చస్సు కల్గును. కళ్ళలో కాంతులు పెరుగును. దృష్టి దోషములు తగ్గును.

ఇదే ఆసనమును కొన్ని చిన్న మార్పులతో చేసిన అధికశక్తిని పొందవచ్చును. ఇది గురుముఖముగా చేయ వలయును.

# విద్యార్థులు

పరిస్థితులు వున్నవి వున్నట్టు పరిశీలించి, విద్యా ర్థులు దేశసేవ చేయడానికి సాధ్యమైన విషయాలు ఏమిటీ అని మనం తెలుసుకోవాలి. విద్యార్థులు తమ పేరు ప్రతిష్ఠలు నిలబెట్టుకొని దేశసేవ చేయా లంటే విద్యార్థులు మొదట తమ శీలం బలపర్చు కొని ఆత్మపరీక్ష చేసుకోవాలి. చక్కని విద్యావిధా నం ఏర్పడాలంటే సంఘంలో పవిత్రమైన వ్యక్తి జీవితం అవసరం. జ్ఞాన సముపార్జన పరమావధి శీలము ప్రవర్తన అభివృద్ధి పర్చుకోవడం. సత్యం, నిర్దోషిత్వం, నిష్కాపట్యం అన్న విషయాలను అన్ని మతాలు ఉద్బోధించాయి. అహింసయొక్క ప్రాధాన్యం అన్నీ గుర్తించాయి. అందుచేత తాము సత్యం, దయాదాక్షిణ్యాలు అలవర్చుకున్ననాడు వారు, వారి భవిష్యత్తుకి పునాదులు వేసుకున్న వారవు తారు. దానికి పునాదిరాయి సత్య ప్రవర్తన. ఏ పరిస్థితులలోను అబద్ధం ఆడవద్దు. ఏదీ రహస్యంగా ఉంచుకోవద్దు. మీ గురువుల యెడ, మీ పెద్దల యెడ విశ్వాసంవుంచి, మీ సమస్యలన్నీ ఏవీ దాచకుండా వారికి చెప్పండి. ఎవరి యెడా ద్వేషం, స్వర్థ వుండ కూడదు. ఎవరిని గురించీ వారి వెనుక చెడుగా మాట్లాడవద్దు. అన్నిటికన్నా ముఖ్యంగా, మిమ్ము లని మీరు దగా చేసుకోకండి. ఇతరులని దగా చేయ డానికి ప్రయత్నించకండి. జీవితంలో ప్రతిచిన్న విషయంలోనూ సత్యబుద్ధితో ప్రవర్తిస్తే, అది పవిత్ర జీవనానికి దారితీస్తుంది.

— మహాత్మాగాంధీ

# సమాజంలో దానం స్థానం

దానం అంటే ఇవ్వడం. పూర్వ ప్రామాణిక గ్రంథాలన్నీ దానానికి గొప్ప స్థానం ఇచ్చాయి. అన్నదానం వస్త్రదానం, అంటూ ప్రధానంగా పేర్కొన్న సప్తదానాలను బట్టి చూస్తే పరోక్షంగా ధనాన్ని ఇవ్వడమే దానంలో జరిగేది.

వ్యక్తి తనలోని స్వార్థాన్ని పూర్తిగా జయిస్తేగాని దానం ఇవ్వలేడు. ఈ దృష్ట్యా దాత ఉత్తముడే. పేద వారికి తాత్కాలిక ధన సహాయం అందజేస్తుంది గాన దానం హితకారిణియే. కానీ నిశితంగా పరిశీలిస్తే దానం ప్రతి పాదితమైన పరిస్థితులు ఏదో వ్యూహాన్ని బట్ట బయలు చేసూఉంటాయి.

కొలకలూరి రూపరా

ఏ విధంగాను తిరిగి తీర్చే శక్తి యేమాత్రమూలేని వాడికి ఇచ్చేదే దానం అన్నారు. ఈ నిర్వచనం దాతను గ్రహీతను ఇరు వర్గాలుగా విడగొట్టి చూపుతుంది. "దానం దదాతి పుణ్యం" అనే సూక్తి వీరిద్దరికీ సమానంగా వర్తిస్తుందా? దానం ఇచ్చేవారికి మోక్షమే. ఆ పుణ్యం తీసుకునే వాడికి వద్దా! దానాలిచ్చి కొందరు పుణ్యాలు ఆర్జిస్తుంటే వారికి అనుకూలంగా కొందరు గ్రహీతలై పుడుతూ ఉంటారా? ఈ నీతిలోని వైరుధ్యం అదే.

దాతకు "దాత ,యనగ తొమ్మిదవ గజంబు" అనే గౌరవస్థానం ఉంది. గ్రహీతకు అదే గుర్తింపు ఉంటుందా? రికార్డు స్థాయిలో దానాలుచేసి 'దానయ్య' అనే బిరుదు దాత సంపాదిస్తే దానాలు పట్టి పేదవాడు గ్రహీత ఘనత వహించ గలడా?

అహాన్ని పూర్తిగా విసర్జించి గ్రహీత యెడల పూర్తిగా గౌరవ ప్రతిపత్తులతో దానం ఇవ్వాలని ఒక భావం ఏర్పాటయ్యింది. ఐనా వాస్తవంలో ఇది సాధ్యమేనా?

" ఆదిన్ శ్రీసతి కొప్పుపై
నూత్న మర్యాదంజెందు కరంబు క్రిందగుట
మీదైనా కరంబుంలే మేల్గాదే "

అనే వాక్యం వల్ల దాతది పైచేయి అని సూచిస్తున్నాడు బలి.

" ఏ భూపాలుడీ వచ్చివన్
సాలగ్రావము ముందుగా గొనడు."

అంటున్నప్పుడు దానాలను స్వీకరించ నవసరంలేని స్థితిని గౌరవప్రదమైనదిగా నొక్కి వక్కాణించడం జరుగుతున్నది.

ఆత్మగౌరవం మాట ఎలాఉన్నా దరిద్రునికి దానం తాత్కాలికంగ ఆదుకొంటుంది. కాని దానాలు ఎంతవరకు ఇవ్వగలరు? పాత్రతతో పని లేనిది ముష్టి ఐతే, పాత్రత గలది దానం. ప్రతి కోటీశ్వరుడూ తన అవసరానికి ఒక కోటి ఉంచుకొని మిగతా తొమ్మిదికోట్లు అర్హులైన తొమ్మిదిమంది పేదలకు దానం ఇస్తే దేశంలో పేదరికం నిర్మూలన మౌతుంది కదా. మరి తరాలు గడుస్తున్నా ఆర్థిక వ్యత్యాసాలు అలాగే ఉన్నాయేమిటి? ఇలా ఆలోచిస్తూపోతే దానం సమానత్వానికి సాధనం కాదని తెలుస్తుంది. ఆర్థిక వ్యత్యాసానికి అది ప్రబల సాక్ష్యమనీ తెలుస్తుంది.

భౌతికంగా ఇంచుమించు సమాన శ్రమశక్తిగల ఇద్దరు వ్యక్తుల్లో ఒకరు అవసరాలకు అనేకరెట్లు మించే సంపదకు, మరొకరు కనీస అవసరాలకు కూడా చాలకుండా

దారిద్ర్యానికి ఎలా వారసులౌతున్నారో తెలుసుకోవాలి. దోపిడీ విధానాల వల్ల అధిక ఆర్జనచేసే అవకాశాలు తగ్గిస్తే దానం చేసినంత పుణ్యమే వస్తుంది. ఎవరి శ్రమ శక్తిమీద వారు ప్రతిఫలాన్ని పొందటానికి అనువుగా ఉపాధి- ఉద్యోగ కల్పనలు అమర్చగలిగితే దేశంలోపుట్టే ప్రతివ్యక్తి దేశాదాయంలో భాగస్వామి ఔతాడు. ఆవిధంగా పేదవర్గాల ప్రజలు ఎవరి దయా దాన ధర్మాలపై ఆధారపడక గౌరవ ప్రదమైన జీవికను స్వయంగా పొందుతారు.

ప్రస్తుత సమాజంలో దానాన్ని నిషేధించడం అంటే భుక్తి గడవని పేదవారి జోలెలో మట్టి జల్లటమే ఔతుంది. పేదల ఆకలి తిరగ బడకుండ ఉండటం కొరకో లేక పేదవారికి శతాంశ- సహస్రాంశాలకైనా రక్షణ కల్పించడం కొరకో మన పూర్వులు దానాన్ని ప్రతిపాదించారు. ఆర్జన పెంచుకొంటూనే పిల్లికి బిచ్చంపెట్టని పరమ లోభులనుండి ఆమాత్రమైనా త్యాగం చేయించే "దానం" నేటి పరిస్థితులలో చాలా అవసరము. కనుక వీటిని తాత్కాలిక ప్రయోజనం కొరకు ప్రబోధిస్తూనే ఇంతకంటే మహోత్కృష్టమైన ఆర్థిక సమానత్వం కొరకు జరిపే కృషిని, బలపర్చడం మానుకోరాదు. పీడితవర్గాలు చైతన్యవంతులై దానాలను నిరసించిన నాడే దానికి నిషేధం. ఆ చైతన్యమే మనదేశ సంస్కృతి చంద్రమండలానికి ఒక ధవళాంశువును జోడిస్తుంది. 

## పరిమళాపహరణ

తరులతలు
మొగ్గ పెట్టెల్లో
దాచిపెట్టుకొన్న
తావి సిరుల్ని
పట్టపగలే
కిరణాల తాళం చెవులతో
తీసుకుని
పవన హస్తాలతో
దోచుకుంటున్నాడు
సూర్యుడు !
ఒట్టి గజదొంగ !!

— ఉమ్మెటి విఘ్నేశ్వరరావు

## ఉదాహరణం

ఇద్దరి సీట్లో మరో
పెద్దమనిషి చేరి
సర్దుకు కూర్చోడం
సౌజన్యం !

ఇద్దరి మధ్య దూరి
మొదటివాణ్ణి బాధించి
తరిమివేయడం
దౌర్జన్యం !

వ్యాకరణ బోధనలో
మొదటిది ఆగమానికి
రెండోది ఆదేశానికి
ఉదాహరణం !

పి. వి. యస్. శాస్త్రి

# సామాన్యమైన రాజకీయ మేధావి

# డాక్టర్ శ్యామ్ ప్రసాద్ ముఖ

సుమారు 24 సం॥ క్రిందట నాగపూర్‌లో డాక్టరు శ్యాంప్రసాద్ ముఖర్జీని కలిసే అవకాశం నాకు లభించింది. అప్పుడు రాష్ట్రీయ స్వయం సేవకసంఘ శిక్షణ తరగతులు జరుగుతున్నాయి. పరమ పూజనీయ డా. హెడగేవార్ నాకు వాటి బాధ్యతను అప్పగించారు. వారు పూనానుండి తిరిగి రాగానే జ్వరంతో మంచంపట్టి ఇంటివద్దనే వున్నారు. డా. ముఖర్జీ హిందూ మహాసభ సమావేశాలకు బొంబాయి వెళ్ళి తిరిగి వచ్చేటప్పుడు ప్రత్యేకంగా పరమ పూజనీయ డా. హెడె గేవార్‌ను కలుసుకోవడానికి నాగపూర్‌లో ఆగారు. కాని డా. హెడగేవార్‌గారికి జబ్బుగా వుండటం వలన మామూలు కుశల ప్రశ్నలు మాత్రమే జరిగాయి. ప్రముఖమైన విషయాన్ని దేనినీ చర్చించడానికి వీలులేకపోయింది. సంఘం హిందూ మహాసభయొక్క రాజకీయ కార్యక్రమాల్లో పాల్గొంటుందా? పాల్గొంటే ఎలా పాల్గొంటుంది? అనేదే చర్చా విషయం. రాష్ట్రీయ స్వయం సేవకసంఘం రాజకీయ ఆందోళనలకు దూరంగా వుండటం ఎందుకు అవసరమో వివరిస్తూ అడిగిన ప్రశ్నకన్న సమాధానం తప్ప ఇంకేమీ మాట్లాడటానికి వీలులేకపోయింది.

అన అభిప్రాయానికి భిన్నమైన దానిని సహితం సానుభూతితో అర్థం చేసుకోవడానికి డా. ముఖర్జీ కనపరచిన సంసిద్ధత, వారి సహృదయత నన్ను ఆకర్షించాయి. ఒక వాదంలోని బలాన్ని-అది తన నిశ్చితాభిప్రాయాలకు వ్యతిరేకమైనా సరే-అంగీకరించడానికి సిద్ధపడే వ్యక్తి అని నాకు అనిపించింది. జన్మసిద్ధమైన, సహజమైన మహత్తు కలిగియున్న వ్యక్తులలో కనిపించే ఈ గుణంవల్ల ప్రథమ దర్శనంలోనే ఆయన నా మనస్సును ఆకర్షించారు. అప్పటినుంచీ వారిపై నాకు గౌరవం వృద్ధిచెందింది.

ఏ రాజకీయ పక్షమూ తన ప్రయోజనాలకోసం ఉపయోగించుకోలేని స్వతంత్ర సంస్థగా సంఘమును ఉంచడం, దాని పూర్వాపరాలను గూర్చి అప్పుడు తీవ్రంగా చర్చించడం జరిగింది. చర్చలో వారు ఉద్రిక్తులు కాలేదు. నేను వివరించే ప్రతి విషయాన్నీ అర్థం చేసుకోటానికి ఉత్సుకతను చూపించారు. అందుచే వారిపై నాకుగల గౌరవం ఇనుమడించింది.

ఈ సమావేశం తర్వాత (మే 1940) వారిని కలుసుకొని, మనదేశానికి సంబంధించిన అనేక ప్రముఖ సమస్యలను వారితో చర్చించే అవకాశాలు నాకు చాలా లభించాయి. రాజకీయ పక్షాలు, మనదేశంలో నివసించే హైందవేతరులను దూరం చేయటం తగదని మనస్ఫూర్తిగా నమ్మటం వల్ల వారు తరువాత హిందూ మహాసభనుండి విడిపోయినప్పటికీ, ఆ సంస్థకు స్ఫూర్తిదాతయైన స్వాతంత్ర్య వీర సావర్కార్‌పై ఆయనకు భక్తి, ప్రపత్తులు ఏ మాత్రం తగ్గలేదు. వారు అనేకసార్లు సావర్కార్‌గారిని గూర్చి మాట్లాడుతూ ఉంటే వారి భావావేశం ఆ మాటలు విన్న నన్నుగూడ కదిల్చేది. మహాత్మాగాంధీ హత్యా విచారణ సందర్భంలో సావర్కార్ కూడా నేరస్థులలో ఒకరుగా విచారించబడుచున్నప్పుడు, అటువంటి నిష్కళంక దేశభక్తుణ్ణి ఆ విధంగా అవమానించడం ఘోర అన్యాయమని డా. ముఖర్జీ ఎంతో బాధపడుతూ చెప్పేవారు. అది తమతో విభేదించేవారి పేరు ప్రతిష్ఠలను మంటగలి

పేందుకు చేసే ప్రతీకారచర్య మాత్రమేయని వారి నమ్మకము.

## మంత్రిపదవికి రాజీనామా

డా. ముఖర్జీ జీవితంలో చివరి ఘట్టం వచ్చింది. లక్ష లాది ప్రజలు నిర్వాసులై, అమానుషమైన అత్యాచారాలకు లోనై, తలదాచుకోటానికి వెదుకులాడుతూవుంటే వారు మంత్రి పదవిలో సుఖంగా కాలం గడపలేకపోయారు. వెంటనే పదవీ విరమణచేసి, తమ ఏకైక జీవనలక్ష్యం ప్రజాసేవయేననీ, పదవులకోసం ప్రాకులాడటం కాదని ఋజువు చేసారు. ఈ సంఘటన, వారి జీవితంలో అనేక ఇతర సంఘటనలు ఈ విషయాన్నే నిరూపిస్తాయి.

తమ ఆదర్శాలకు, ఆశయాలకు అనుగుణంగాలేని ప్రభుత్వంలో తన కయిష్టమైన మంత్రిపదవినుంచి విముక్తు డైన పిదప ఏ మార్గం స్వీకరించాలనే ప్రశ్న వచ్చింది. వారు ప్రముఖంగా రాజకీయవేత్త అవటంవల్ల, ఆశయాల లోను, ఆచరణలోను తనకు సరిపడిన రాజకీయపక్షం కోసం నలువైపులా వెదకారు. బహుశా వారికి ఏ పక్షమూ నచ్చి యుండదు. కాంగ్రేసు జాతీయతకు దూరమై, మత తత్వ (Communal Appasement) సంతుష్టీకరణ విధా నాన్ని అవలంభిస్తోంది. కాంగ్రేసు వినాశానికి, అవమానా నికి మాత్రమే దారి తీస్తుందని వారి అభిప్రాయం. ముందే చెప్పబడిన కారణము వలన వారు హిందూ మహసభ నుండి బయటకి వచ్చారు. సోషలిస్టుపార్టీకి, ప్రజాపార్టీకి ఆదర్శాలలోగాని, కార్యక్రమాలలోగాని నిశ్చితమైన భూమికలేనట్లు కనబడింది. కమ్యూనిస్టుపార్టీ ప్రసక్తియే లేదు. కమ్యూనిస్టుపార్టీ జాతీయమైనది కాదు. రష్యనుల చెప్పు చేతలలోవుంది. అభారతీయమైన సిద్దాంతాలు ప్రచా రం చేస్తుంది. శాసన విరుద్ధమైన చర్యలను ప్రోత్స హిస్తుంది. ఈ పక్షాలన్నీ నచ్చనందున సహజంగా వారు దేశం లోపలా బయటా ఉన్న పరిస్థితులను ఎదుర్కోవ డానికి ఒక క్రొత్తపక్షాన్ని నిర్మించే ప్రయత్నం చేసారు.

ఈ వ్యాస రచయిత రాష్ట్రీయ స్వయం సేవక సంఘ మాజీ సర్‌సంఘచాలక్ పరమ పూజనీయ శ్రీ గురూజీ (శ్రీ గోళ్వా ల్కార్) 1965 సం. విజయవాడలో జరిగిన అఖిలభారతీయ జనసంఘ మహాసభల సంద ర్భమున ముద్రించిన 'సావనీర్' లో ఈ వ్యాసం ప్రచురించబడింది. గమనించ ప్రార్థన.

— సం.

## సంఘ - జనసంఘ సంబంధాలు

నా సహచరుడుగా ఉండే, సంఘ స్వయం సేవకులకు 'ఉండదగినంతగా' రాజకీయ కార్యక్రమాలపై మక్కువ పెంచుకున్న శ్రీ వసంతరావ్ ఓక్, డా. ముఖర్జీతో సన్ని హిత సంబంధము కలిగి వుండేవారు. ఆ పరిచయంవల్ల నే డా. ముఖర్జీ పై విషయంలో నా సహాయ సహకారము లను కోరదలచినట్లు తోస్తుంది. తత్ఫలితంగా మేము తరచు కలుసుకొని తత్సంబంధమైన విషయాలు చర్చిం చాము. రాజకీయ పక్షాలకు అనుబంధ సంస్థగా చేయ ప్రయత్నిస్తే, జాతీయ జీవనంయొక్క సర్వాంగీణ ఉన్న తిని ధ్యేయంగా పెట్టుకున్న ఏ సంస్థగాని విజయవంతంగా నడువలేదనీ, అందుచేత ఏ రాజకీయ పక్షముయొక్క ఆదుపాజ్ఞలలోను సంఘం ఉండదని, నేను స్పష్టం చేశాను. వారు యీ విషయాన్ని గుర్తించారు. ఇది సత్యమని అంగీకరించారు. క్రొత్త రాజకీయపక్షం ఏ యితర సంస్థకు లొంగివుండరాదనీ, అప్పుడే అది అభివృద్ధి చెందుతుందని కూడా భావించారు. ఆర్. ఎస్. ఎస్. కీ, ఈ క్రొత్త పక్షానికి వుండవలసిన సంబంధాన్నిగూర్చి ఈ ప్రముఖ అంగీకారం కుదిరిన తర్వాత క్రొత్త పక్షం ఏ ఆదర్శం

కొఱకు పనిచేస్తుంది అనే చర్చ వచ్చింది. సంఘానికి ఒక నిశ్చితమైన ఆదర్శము, కార్యపద్ధతి ఉన్నాయి. అందుచేత ఈ సంస్థయొక్క సభ్యుల సహకారం కావాలంటే క్రొత్త పక్షముయొక్క రాజకీయ ఆదర్శంలో సమాన భావన వుండాలి. ఈ విషయమైకూడా పూర్తి ఏకీభావం కుదిరింది. ఒక పత్రికా విలేఖరుల సమావేశంలో మాట్లాడుతూ వారు హిందూ మహాసభ హిందూరాష్ట్రాన్ని నమ్ముతోంది. కనుక అది మతసంస్థ అని అన్నారు. నేను భారతరాష్ట్రం, హిందూరాష్ట్రం అని సంఘానికి ధృడ విశ్వాసం వుందనీ, అందుచేత సంఘాన్నికూడ దూరంగా వుంచాలనీ పర్యవసానంగా నా సానుభూతినిగాని, సంఘం యొక్క హిందూరాష్ట్ర ఆదర్శాన్ని నమ్మి, దాని కొఱకు నిర్విరామంగా కృషి సలిపే తన కార్యకర్తలయొక్క సహకారాన్ని కాని వారు అపేక్షించ నక్కరలేదనీ తెలియజేసాను. దానికి సమాధానంగా వారు తాను పరాకున ఆ మాట అన్నాననీ, హిందూరాష్ట్ర ఆదర్శంతో పూర్తిగా ఏకీభవిస్తున్నాననీ, మన రాజ్యాంగం భారతీయ రాష్ట్రీయతను గుర్తించి ప్రకటించ లేకపోయిందనీ తెలిపారు. హిందూరాష్ట్ర స్థాపన ఆధునిక ప్రజాస్వామ్యం భావానికి కూడా విరుద్ధమైనది కాదు. ఎందువల్లనంటే హిందూ రాష్ట్రం హైందవేతరులకు కూడా పూర్తి పౌర స్వాతంత్ర్యాన్ని, రాజకీయ, మత, సాంస్కృతిక రంగాల్లో సమాన హోదాను (వారు జాతీయ వ్యతిరేక కార్యకలాపాలు చేయకుండా ఉంచేవరకు, లేదా అధికారాన్ని చేపట్టి రాష్ట్రాన్ని స్వీయౌన్నత్యంనుండి తొలగించాలని ప్రయత్నం చేయనంతవరకు) ఇస్తుంది అనికూడా వారు అన్నారు. నిజానికి ఈ విషయాన్ని పార్టీ ఆశయాదర్శాల లోనే వివరించే ఆతృతనుకూడా కనపరిచారు. ఈ విధంగా పూర్తి ఏకీభావం కుదిరిన తరువాత నేను సంఘ కార్యకర్తలలోనుండి క్రొత్తపక్షాన్ని స్థాపించే బాధ్యతను నిస్వార్థంగాను, నిపుణతతోను నిర్వహించగలిగి, పేరు ప్రఖ్యాతులుగల అఖిల భారతీయ పక్షంగా దానిని రూపొందించడానికి అనువైన భూమికను ఏర్పరిచే శక్తి సామర్థ్యాలుగల వారిని కొందరిని ఏరాను. ఇల్లా భారతీయ జనసంఘం స్వరూపంలో డా. ముఖర్జీ తన ఆశయానికి రూపకల్పన చేసుకున్నారు.

డా. ముఖర్జీకి చక్కని కార్యకర్తలను అప్పజెప్పిన తరువాత నేను మా ఆదర్శానుగుణంగా—జనసంఘం యొక్క మిగతా కార్యక్రమాలనుండి పూర్తిగా దూరంగా ఉన్నాను. రాష్ట్రీయ స్వయంసేవక సంఘంద్వారా హిందూ ప్రజల సాంస్కృతిక పునర్జీవన కార్యక్రమాన్ని కొనసాగించడంలోనే పూర్తిగా నిమగ్నుడనైనాను. కాని అప్పుడప్పుడు మేము కలుసుకొనే అవకాశం వచ్చినప్పుడు, వారునాకు జనసంఘ ప్రగతినిగూర్చి చెప్పేవారు. నేను సంఘకార్యంలో వారి సహకారాన్ని అర్థించడం జరిగేది. వారు సంఘ కార్యకర్తలకు ఎప్పుడు ఏ అవసరం వచ్చినా పూర్తిగా తోడ్పడేవారు. కేవలం సాంఘిక కార్యక్రమాలలో కలసి పనిచేసినందువల్ల వచ్చే స్నేహాన్ని అధిగమించిన అభిమానబంధం మా ఇద్దరి మధ్య ఉద్భవించి దినదినాభివృద్ధి గాంచింది. మా సంస్థలకు సంబంధించిన దాదాపు ప్రతి ప్రముఖ విషయంలోనూ మేము ఒకరితో నొకరు సంప్రదించడం జరిగేది. అంతమాత్రం చేత ఒకరి కార్యంలో ఇంకొకరు జోక్యం కలిగించుకోవడం జరిగేది కాదు.

## కుట్రకు బలి

కేవలం ఒక్కసారి మాత్రమే వారు సన్నిహిత మిత్రునిగా నాతో సంప్రదించకుండా, వ్యక్తిగతంగా తనపై విశేష పరిణామాన్ని తెచ్చే చర్య తీసికొన్నారు. ఆ చర్య కాశ్మీరు (అందులో ఒక భాగాన్ని రక్షించి, చెరవరాని కీర్తిని జనసంఘానికి చేకూర్చినట్టిది) కు సంబంధించినది. కాని దురదృష్టవశాత్తు ఆ చర్య వారి మరణానికి దారి తీసింది. డా. ముఖర్జీ స్వయంగా కాశ్మీరుకు వెళ్ళకూడదనీ, వెళ్ళినట్లయితే తిరిగి రారనీ నాకు ఒక భావనవుంది. అది ఎందువల్లనో నేను చెప్పలేను. నేను వారిని ఆ చర్యనుండి విరమించవలసినదిగా కోరుతూ కబురు పంప

(తరువాయి 55వ పేజీలో)

# తొలకరి

— అద్దేపల్లి లక్ష్మణస్వామి

తిలకింపన్ గృషి నాటకంబునకు నాందీభూతమై యొప్పు నీ
తొలుకారిప్పుడు గ్రీష్మ తాపమును బోఁద్రోలన్, ధరామాత తాఁ
బులకించున్, దన రైతుబిడ్డలను లేపున్, వారి కుత్సాహమున్
గొలుపున్, జక్కఁగ నేరువాక యది సాగున్ నిర్విరామంబుగన్ !

ఖరమై, దుర్భరమై, భయంకరమునై, వ్యాపింప నల్దిక్కులన్
ధర గ్రీష్మోష్మదవంబు నార్పి, నవచైతన్య ప్రభాజాల వి
స్ఫురణన్ భూతగణంబుపైఁ బిలుపు నంభోదంబునా నొప్పు తొ
ల్కరి వర్షించెను శాంతిసౌఖ్య జలధారల్ నేత్ర పర్వంబుగన్ ।
(దవము(రూ దావము = కారుచిచ్చు)

తొలుకారౌటనె యైతి తొల్కరివి, చేతోమోద మొప్పార, మేన్
బులకింపన్, సరళంబులై తనరి, వంపుల్ టొంపులున్ లేని నాఁ
గలిచాళ్ళన్ సిరిచేడియన్ నిలిపి, చక్కన్ నాట్యమాడించు ని
స్తులమౌ నీదగు కౌశలంబుఁ గని, రైతుల్ మెత్తురో తొల్కరీ !

ధరణీమాత నిదాఘతాప జనితోదన్యాపనోదార్థమై
తెఱచెన్ నోరన నెఱ్ఱయొండు కడు భ్రాంతిన్ గొల్పు, మేఘుండు తా
నురు కారుణ్యమెలర్పి, ఆ దగను దానొయ్యన్ నివారింపఁ దొ
ల్కరి వర్షించె నటంచు నెంచుచు నమస్కారంబు లర్పించెదన్ !
(ఉదన్యా = దప్పిక, దగ = దప్పిక; అపనోదనము = పోఁగొట్టుట)

కారను మాట పుట్టినది కాలపదంబుననుండి, దానఁదొల్
కారని చెప్పనౌ తొలుతకౌ, రదె తొల్కరియయ్యె, జూడ ము
క్కారులలోన నియ్యదియె కన్పరు తొత్తను, కావనిట్లు తొ
ల్కారుననుండి పుట్టుటనె తొల్కరియయ్యె నటంచు నెంచెదన్ !

తొలుకుట యన్నచో మదికిఁ దోఁచెడు వేఱొక యర్థ, మద్దియున్
దలఁపఁగ సార్థకంబె యగు, దాని నిటుల్ వివరింతు విందురే !
తొలుకున కర్థమౌ కురియు, తొల్కెడు కారిది, అందుచేతనే
తొలకరి యైనటుల్ మదికిఁ దోఁచెడుఁ గాదనువారలుందురే ?

# ఇరువై ఏళ్ళలో ప్రపంచమంతా హిందూ రాజ్య మౌతుందా?

మైకేల్-డి నాస్త్రేడమ్ అనే ఫ్రెంచి జ్యోతిష్కుడు "నాస్ట్రోడమ్" అనే పేరుతో ప్రపంచ భవిష్యత్తు ను గురించి ఒక పుస్తకం వ్రాసారు. 1555లో ప్రచురించిన పుస్తకంపేరు "సెంచరీస్" (శతాబ్దాలు). ఈయన జననం 13 డిశంబరు 1503 సం. 1529 సం. లో డాక్టర్ ఆఫ్ మెడిసన్ పట్టా సంపాదించినాడు. జూలై 2, 1566లో ఈయన నిర్యాణంచెందారు.

ఆయన రానున్న 2240 సంవత్సరాలలో 2500 సంగతులను గురించి జ్యోతిష్యం "సెంచరీస్" గ్రంథంలో వ్రాశారు. వాటిలో 900 సంగతుల కాలం దాటిపోయింది. ఆయన చెప్పిన జోస్యాలన్నీ నిజమైనాయి. ఇంకా మిగిలిన 1600 సంఘటనలు, రాబోయే 1700 సంవత్సరాలకు సంబంధించినవి.

"నాస్ట్రోడమ్" వ్రాసిన గ్రంథాన్ని 1672లో థియోడార్ గారేస్సియర్స్ ఇంగ్లీషులోనికి అనువాదం చేసారు. 1715 లో రెండో అనువాదం వచ్చింది. 1940 లో మోడరన్ లైబ్రరీ ఇదే అనువాదాన్ని మళ్ళీ ప్రచురించింది. ఈయన గ్రంథంలో (1555సం. పూర్వమే) 20 శతాబ్దంలో జరిగిన రెండు ప్రపంచయుద్ధాలను గురించి జోస్యం చెప్పడం జరిగింది. 1792 లో జరిగిన ఫ్రెంచి విప్లవాన్నిగురించి కూడా వ్రాయబడింది. 1942లో బ్రిటీషు సామ్రాజ్యానికి ప్రమాదం సంభవిస్తుందని, ఆ తరువాత పతనమవుతుందని వ్రాయబడింది. 1942 క్విట్ ఇండియా ఉద్యమం జరగడం, ఆ తరువాత 1947 లో ఇంగ్లీషువారు భారతదేశం వదలి వెళ్ళడం జరిగింది. రచయిత పుస్తకం ప్రచురించే నాటికి (1555 సం) బ్రిటన్ అనే దేశమే లేదు. సామ్రాజ్య మంతకన్నా లేదు. 1603 లో ఇంగ్లండు స్కాట్‌లండులు కలసిన తరువాత బ్రిటీష్‌దేశం అవతరించింది. 1757 లో ప్లాసీయుద్ధం జరిగిన తరువాతనే భారత దేశంలో బ్రిటీష్అధికారం స్థిరపడింది. దీనినంతా 1555లో "నాస్ట్రోడమ్" ఊహించడం విశేషం.

ఈ రచయిత ఎప్పుడూ భారతదేశం రాలేదు. ఈఫ్రెంచి జ్యోతిష్కుడు విశ్వవిజయాన్ని సాధించే శక్తివంతమైన హిందూరాజ్యం ఉదయిస్తుందని 1555 సం.లోనే జోస్యం చెప్పాడు. అతి భయంకర భీకర పోరాటం 1999లో ప్రారంభమై 7 సంవత్సరాలు కొనసాగుతుందని, ఆపోరాటంలో 2,50,000 మంది హిందూవీరులు నేల పాలవుతారని, కానీ చివరకి హిందువులకే విజయం లభిస్తుందని పైపుస్తకంలో పేర్కొనబడింది. హిందూ వీరులు ఆల్ప్స్ పర్వతాలను లంఘించి ఫ్రాన్స్‌లోనికి చొచ్చుకొనిపోయి, భీకరయుద్ధం తరువాత పారిస్ వశమవుతుందని ఆ పుస్తకంలో వ్రాయడం జరిగింది. 'నాస్ట్రోడమ్' ఆశ్చర్యాన్ని కలిగించే జోస్యంచెప్పారు. "పారిస్‌నగరం నట్టనడుమ నిలచిన ఒక మహావృక్షం కూలిపోతుంది" అనివ్రాశాడు. ఏమిటావృక్షం? అది ఆయ్‌ఫిల్ టవరా? నాస్ట్రోడమ్ నిర్యాణం జరిగిన 300సం. తరువాత నిర్మించబడిన ఈ ఆయ్‌ఫిల్ టవర్ దూరం నుంచి ఒక పెద్ద ఓక్‌వృక్షంలా కనిపిస్తుంది.

మూడుసముద్రాలు కలిసేచోట (ఉపమహాద్వీపం) ఒక మహాశక్తిసంపన్నుడు ఉద్భవిస్తాడని, అతడు గురువారంనాడు జన్మించడం జరుగుతుందని, ఆయన వివేకసామర్థ్యానికి అన్ని దేశాలు మోకరిల్లుతాయని,

ఆయనకు ఎదురుతిరగడం దిద్దుకోలేని పొరపాటవుతుందని "నాస్ట్రోడమ్" వ్రాశాడు. భూగోళంలో దక్షిణభారత మొక్కటే ఉపమహాద్వీపము. అక్కడే మూడు సముద్రాలు కలసి మూడుదిక్కుల్లో వ్యాపిస్తాయి. ఈ మహా నాయకుడు గురువారాన్ని పవిత్రదినంగా భావిస్తాడు. ఆయన దక్షిణ భారతీయుడుగా జన్మిస్తాడు. హిందువులు మాత్రమే గురువారాన్ని పరమ పవిత్రదినంగా భావిస్తారు. ముస్లింలు శుక్రవారాన్ని, క్రైస్తవులు ఆదివారాన్ని, యూదులు శనివారాన్ని పవిత్రంగా భావిస్తారు. భవిష్యత్తులో అవతరించే విశ్వవిజేత దక్షిణభారతీయుడూ, ఆస్తికుడూ, బుద్ధిమంతుడూ, సర్వసమర్థుడు అయి వుంటాడని "నాస్ట్రోడమ్" స్పష్టంగా తెలియబరిచాడు. ఆ యుద్ధంలో రష్యా, అమెరికాలు సహితం భారత దేశానికి మిత్రదేశాలు అవుతాయట.

అమెరికా మహిళ "జీన్‌డిక్సన్" (ప్రఖ్యాత జోతిష శాస్త్రవేత్త) కూడా "నాస్ట్రోడమ్" జోస్యాన్ని బలపరచడం జరిగింది. ఆమె వ్రాసిన "ది గిఫ్ట్ ఆఫ్ ప్రోఫెసీ" లో 1947లో భారతదేశ విభజన జరుగుతుందని 1944లో జోస్యంచెప్పింది. 1945లో కమ్యూనిష్టులు చైనా అధికారాన్ని హస్తగతం చేసుకుంటారని, 1980లో సంజయ్‌గాంధీ మరణిస్తాడని కూడా ఈమె జోస్యం చెప్పింది.

పై ప్రముఖ జ్యోతిష్కులు చెప్పిన విషయాలు చాలావరకూ ఋజువైనాయి. భవిష్యత్తులో జరుగవలసిన సంఘటనలు కూడా ఋజువు కావచ్చునని ఆశిద్దాం. యదార్థమైతే 20 ఏళ్ళలో ప్రపంచాధిపత్యం హిందువులకు లభిస్తుంది. ఇంతకన్నా మనకేం కావాలి.

(1984 లో "ఆర్గనైజర్" ఇంగ్లీషు వారపత్రిక, "తరుణభారత్" మరాఠీ పత్రికలు "సెంచురీస్" గ్రంథం లోని పై విషయాలను ప్రచురించినాయి.)

— సం

(52వ పేజీ తరువాయి)

డానికి ప్రయత్నించాను. కాని విధిలిఖితము యెలా వుందో అలా జరుగుతుంది. వారి పేరు ప్రతిష్ఠలుచూచి వారి చుట్టూ చేరిన పెద్దలవల్ల నా కబురు అందలేదు. నేను ఒక పెద్ద అండను కోల్పోయాను. డా. ముఖర్జీ శరీరం రూపంలోవున్న మన ఉజ్వల భవిష్యత్తుయొక్క ఒక ఆశా రేఖ మాయమయింది. అన్ని వైపులవున్న వ్యతిరేక శక్తుల నెదిర్చి క్రొత్తపక్షాన్ని నిర్మించడం అంత తేలిక పని కాదు. అజ్ఞానులు వెక్కిరించారు. దుష్టులు వ్యతిరేకించారు. అవమానాలు పొందవలసి వచ్చింది. అయినా ఈ దైవాంశగల మహావ్యక్తి దూషణ భూషణాలను లెక్కచేయక తన క్రొత్తపక్షానికి విజయపరంపరలను ప్రజల ఆదరాభిమానాలను సంపాదించారు. ఈనాడు మనం జనసంఘం, కష్టాలను అధిగమించి పురోగమిస్తున్నట్లు చూస్తున్నాం. డా. ముఖర్జీ చనిపోయిన తరువాత జనసంఘం యొక్క సర్వనాశనం తప్పదనే జోస్యం తప్పింది. సోదర భావంతోను, ఒకే ఆదర్శం కోసం, ఒకే సంస్థ కోసం కృషి చేయాలనే భావంతోను, ప్రేరితులైన యువక బృందం ఈనాడు జనసంఘ కార్యానికి కటిబద్ధమైవుంది. డా. ముఖర్జీ యొక్క ఆకర్షణీయమైన వ్యక్తిత్వం, నాయకత్వానికి కావలసిన ప్రతిభ, రాజకీయ పక్షాల వ్యక్తులలో సహితం ఆశలు కలిగించిన వారి అసామాన్యమైన రాజకీయ పరిజ్ఞానం—పూర్తిగా వీటి వల్లనే ఈనాడు జనసంఘం నిలువగలుగుతోంది.

డా. ముఖర్జీ కలిగించిన ఆశలను పూర్తిచేసే బాధ్యత ఆయన అనుచరులపైన వున్నది. వారు మనను వదిలి వెళ్ళేరన్న స్మృతి నా మనస్సుపైన ఒక బరువుగావుంది. ఆ బరువు తొలగించటానికి, నా ఆదరాభిమానాలను చూరగొన్న నా మిత్రులలో అగ్రగణ్యులైన వారి స్మృతికి సంబంధించిన ఈ విషయాలను వ్రాస్తున్నాను. వారి శరీరం మాయమైనా, వారి కీర్తి కాలపురుషుని ఎదిర్చి జయించింది.



# అరవిందులు - సాహిత్య విమర్శ

అరవిందులు రసజీవి. తరువాత ఆధ్యాత్మిక జీవి, రసజీవి లక్ష్యసాధన సౌందర్యం నుంచి దివ్యత్వానికి, అరవిందుని సాధన రసంనుంచి అతీంద్రియ సత్తావేపుకు. మేధస్సు, కళ ,కవిత్వం, పదార్థ విజ్ఞానం అన్నీ పురోభివృద్ధికి దోహదకారులు. అరవిందులు ప్రపంచ సాహిత్యాన్ని క్షోదక్షంగా పరిశీలించారు. ఛందో రహస్యాలను ఆకళింపు చేసుకున్నారు. సావిత్రివంటి బృహత్కావ్యాన్ని రచించారు. ఓవర్‌మైండు పొయిట్రీ అని అది పామరుల కోసం రాసింది కాదనీ ఆయనే అన్నారు. షేక్స్పియరుకంటె గెటేలో లోతుల్లోకి చూపు సారించారు. అంతరాంతర జ్యోతి స్సీమలను వెలికితీశారు. జీవితమూ ఆలోచనా షేక్స్పియరులో వున్నంత గెటేలో లేదు. గెటే మేధావి. షేక్స్పియరు గొప్పకవి. గెటేలోని మానవీయ దృక్పథాన్ని ఎంగెల్స్ కూడా మెచ్చాడు. ఇలియడ్ కంటె భారతం, ఒడెస్సీ కంటె రామాయణం గొప్ప సృష్టి అంటారు. భౌతిక మానవ జీవితాన్ని నిండుగా ప్రతిబింబించిందని వాకొన్నారు. గ్రీక్ ఎలిజబెత్ కవులుకూడా అంతగా ఫోకస్ చేయలేదు. లయ, భాష, వ్యక్తీకరణ, కవితా సౌందర్యం విషయాల్లో వ్యాస, వాల్మీకి కవులు తక్కువ కారంటారు. ఇంగ్లీషు కవులకన్నా మహోన్నతులూ కారని సమన్వయ దృకథాన్ని వెలువరిస్తారు. షెల్లీ Skylark ను గురించి రాశాడు. బ్రహ్మం గురించిరాశాడు.

Life like a dome of many coloured glass
Stains the white radiance of eternity.

అనేది ఎంత మంచి కవిత్వమో

Hail to thee blithe spirit

అన్నా అంత ఉన్నతమైనదే. గీతలోను ఉపనిషత్తులలోను అనితర సాధ్యమైన కవిత్వం వుందన్నారు. కవిత్వం మంత్రం లాగ "అల్పాక్షరముల అనల్పార్థరచన" లా వుండాలనేదే వారి అభిప్రాయం.

కవితా విమర్శ అంతా ఆత్మాశ్రయమే నంటారు ఒకచోట. వర్డ్సువర్తు, డ్రైడను, కీట్సు, షెల్లీలలో గొప్ప కవిత్వాన్ని దర్శించారు. ఆంతరికానుభూతి సాంద్రతవల్ల మేధాగత ఆలోచనవల్ల బ్లేక్ లో పదలాలిత్యం లోపించిందట. మేధాగతమూ, మార్మికమూ అయినప్పుడు సౌందర్యం దెబ్బతింటుంది. విమర్శకుడు కవిత్వానికి నూతన ద్వారాలు తెరుస్తాడు. బ్లేక్ కవిత్వంలోని నిక్షిప్త సౌందర్యాన్ని విమర్శకులు చూపించగలిగారు. శుద్ధ కవిత్వం బ్లేక్‌లోనూవుంది, షేక్స్పియరు లోనూ వుంది. జీవిత నాటక కవిగా షేక్స్పియరు అన్నిచోట్లా వుంటాడు, బ్లేక్ లేడు అంటాడు. షేక్స్పియరు,డాంటె, వర్జిల్ హోరేస్‌లు విశ్వ కవులని వారి తీర్పు. నశ్వర వాక్కులో కూడా జగత్తు శక్తి వినిపిస్తూ వుంటుంది, సాగర ప్రశాంతతను చీలుస్తూ దూరంనుంచి వినిపించే కోయిలకూత మానవాత్మను పిలుస్తున్న అతీంద్రి సత్తా. అలాగే వ్యాసుని వాక్యం: 'వనమ్ ప్రతిభయం శూన్యం ఝిల్లిగా గణ నాదితం.' భగవంతుడన్నాడు ! అనిత్యం అసుఖంలోకం ఇమాం ప్రాప్య భజస్వమామ్ ! అనేక భాషలనుంచి ఉదహరించగలశక్తి ఆయనకుంది. వ్యాస వాల్మీకి కాళిదాసులు ధార్మిక, మేధోద్దీపిత, రస సంపద్విలసిత యుగాలకు ప్రతినిధులన్నారు.

## శివలింగం

చారిత్రక విమర్శ ప్రమాద భరితమూ పరిహరణీయమన్నారు. కావ్యవిశిష్టతను గాక కవి సాంఘిక పరిస్థితులకే పట్టంకడుతుంది చారిత్రక విమర్శ. రాక్షసులకు స్వర్గంలో స్థానం లేనట్టే శాస్త్రానికి కవితోద్యానంలో అడుగిడే పనిలేదట. కాళిదాస కవిత్వం గురించి అరవిందులు రాసిన వ్యాసాలు మననీయాలు. అరవిందులు కవిగా, విమర్శకుడుగా, భారతీయ సాహిత్యంలో ఉన్నత స్థానాన్ని సంపాదించుకున్నాడనడంలో విప్రతిపత్తి లేదు. ★

ఇద్దరు మగాళ్ళూ తృప్తిపడి సర్దుకున్నారు.

"ష్! అరవకండి. అంతగా కాదంటే.. అవతలికెళ్ళి పోట్లాడుకోండి! బాబు ఏడిచి ఏడిచి ఇప్పుడే నిద్రపోయాడు." మరోసారి విసుక్కుని బాబు దగ్గరికి పరిగెత్తి వెళ్ళి చిచ్చి కొట్టసాగింది చందన.

*     *     *     *

శాంతారామ్ ఏదో ఆలోచిస్తూ పడుకున్నాడు. ఆయన ఆరోగ్యంకూడా అంతంత మాత్రంగానేవుంది. తను దిగులుపడితే భార్య ఎక్కడ మరింత కృంగిపోతుందో అని లేని ధైర్యాన్ని, ఉత్సాహాన్ని నటిస్తున్నాడు.




"ఏవండీ!" మెల్లగా వచ్చింది దేవకి.

"ఏవిఁటి?" అన్నట్టు చూశాడాయన.

"నాకేదో భయంగా ఉందండీ!" మంచంమీద కూలబడుతూ అంది.

"భయవాఁ! ఎందుకు?"

"చందనా వాళ్ళు వెళ్ళి వారం అయింది. వెళ్ళాక ఓ ఉత్తరం ముక్కయినా రాయలేదు!....ఎలా వున్నారో ఏవిఁటో!" దిగులుగా అంది దేవకి.

"కులాసాగానే ఉన్నారు!" నవ్వాడాయన.

"కులాసాగా వున్నారా?.... మీ కెలా తెలుసు?"

" ఫోనొచ్చిందోయ్ ! "

" ఎప్పుడు ? .... .... "

" నువ్వు ఆలయాని కెళ్ళినప్పుడు ! "

" మరి నాతో చెప్పనైనా చెప్పలేదేం ? " నిష్ఠూరంగా అంది దేవకి.

" ఏదీ .... నువ్వొచ్చింది ఇప్పుడేగా ! చెప్దామను కుంటుండగానే అడిగావ్ !.... అవునూ.... ఇంతకీ దేవుణ్ణి ఏం వరాలడిగావ్ ? " మాట మార్చాడు శాంతారామ్.

" ఏముంది ! .... నా కూతురి జీవితాన్ని బాగుచెయ్య మని ! "

" సరే అన్నాడా ? "

" ఏమిటీ మీ కంతా వేళాకోళంగా వుంది ! .... నాకు దాన్ని తల్చుకుంటేనే కాళ్ళూ చేతులూ ఆడ్డం లేదు ! .... " కళ్ళు ఒత్తుకుంటూ అంది దేవకి.

" ఛ ! ఛ ! వూరికే అన్నాను దేవీ ! .... నువ్వు అనవసరంగా ఏదేదో ఊహించుకుని బాధపడకు ! " లేచి కూర్చుంటూ అన్నాడు శాంతారామ్.

" ఏమండీ ! "

" ఏమిటి దేవీ ? "

" మనం కూడా ఓసారి వెళ్దామండీ ! "

" ఎక్కడికి ? "

" శ్రీనగర్ ! "

" ఎందుకు ? "

" నాకు చందనని చూడాలనుంది ! "

" ఇవాళో రేపో వాళ్ళే వచ్చేస్తారు ! నువ్వేం బాధ పడకు ! " అనునయంగా అన్నాడు శాంతారామ్.

మరి కాస్సేపు చందన పెళ్ళి తప్పిపోవడం గురించి, అనుకోకుండా తారసపడిన బాబు ముద్దు మాటలు, వాడు మాయమవడం, కూతురికి మతి చలించడం, రాఘవ ఆమెని పెళ్ళిచేసుకుంటాననడం, ఇలా ఎన్నో విషయాలు మాట్లాడుకున్నారు భార్యాభర్తలు.

బాబు విషయం రాగానే మరింత బరువయ్యాయి వారి మనసులు.

" ఇప్పుడు బాబు ఎక్కడున్నాడో ? " భారంగా అంది దేవకి.

" ఎక్కడైతేనేం ! క్షేమంగా మాత్రం వుండి వుంటాడు ! " నమ్మకంగా అన్నాడు శాంతారామ్.

" పాపం ! మన మూలంగా సంబంధంలేని జయంత్ కూడా బాధలు పడుతున్నాడు ! "

" తప్పదు మరి ! కొడుకోసం ! " నవ్వలేక నవ్వాడు శాంతారామ్.

* * * * *

గెస్ట్‌హౌస్‌లో ఒంటరిగా పడుకుని శూన్యంలోకి చూస్తోంది చందన. ఒక చెయ్యి పక్కనే వున్న బొమ్మ మీదుంది. బొమ్మ ఒంటినిండా బ్లాంకెట్ కప్పి వుంది.

మెల్లగా తలుపుమీద తట్టారెవరో.

" ఎవరు ? " భయంగా అంది చందన.

" నేను ! " జయంత్ లోనికొచ్చాడు.

అతన్ని చూడగానే ఆమె కళ్ళలోని భయం రెట్టింపయింది. బొమ్మమీదున్న ఆమె చెయ్యి బిగుసుకుంది.

క్షణం ఆమెకేసి చూసి—

" చందనా ! " చిన్నగా నవ్వుతూ ఆమె దగ్గరగా వచ్చాడతను.

" ఊఁ ! "

" బాబు నిద్రపోతున్నాడా ? "

" ఊఁ ! "

" పాలు పట్టావా ? "

" ఆ ! " బిత్తర చూపులతో అంది చందన.

“ ఏం చేస్తున్నావ్ ? ఆమె పక్కలో కూర్చుంటూ అన్నాడతను.

“ ఆలోచిస్తున్నాను ! ”

“ ఏవాలోచిస్తున్నావ్ ? ” నవ్వుతూ చూశాడతను.

“ బాబుని ఎవరైనా ఎత్తుకుపోతారేమో అని ! ”

“ఛ ! ఎవరూ ఎత్తుకుపోరు !....అయినా నే నిక్కడే వున్నానుగా....బాబుమీద ఈగని కూడా వాలనివ్వను ! ” నమ్మకంగా అన్నాడు జయంత్.

చందన మొహం వికశించింది. బాబుమీది చెయ్యితీసి తేలిగ్గా ఊపిరి తీసుకుంది.

“ చందనా ! .... అలా బైటి కెళ్దామా ? ” మెల్లగా అన్నాడు జయంత్. చందన మాట్లాడలేదు. రెండు నిమిషాల తర్వాత మెల్లగా లేచి అతని బుజంమీద చెయ్యేసి తియ్యగా నవ్వింది.

ముఖం చిట్లించి దూరంగా జరిగాడు జయంత్.

“ వినోద్ ! .... బాబు చాలా అందంగా ఉన్నాడు కదూ ? ” బొమ్మకేసి మురిపెంగా చూస్తూ అంది చందన.

“ ఊఁ ! ”

“ అయితే ఎత్తుకో ! .... ” బొమ్మని తీసి అతని చేతుల్లో పెట్టింది. మరుక్షణం ఆమె కళ్ళలో భయం చోటుచేసుకుంది.

“ అమ్మో ! నువ్వు దొంగవి ! వద్దులే ! అసలే నువ్వు పిల్లల్ని ఎత్తుకు పోతావ్ ! అలాగే నా బాబునీ ఎత్తుకు పోయావంటే....చస్తాం ! .... అసలే నా బాబు నన్నొదిలి క్షణం వుండలేడు ” బొమ్మని గుండెలకి హత్తుకుంటూ అతనికి దూరంగా జరిగింది.

జయంత్ కనుబొమలు చిత్రంగా ముడివడ్డాయి.

“ ఛ ! నేను దొంగనేంటి ? ” అన్నాడు.

“ అవును ! నువ్వు దొంగవే ! ”

“ ఎవరన్నారు ? ”



జరిగిన కథ :

బాబుదొరికాడా? ఆతృతగా అడిగారు రాఘవ దేవకీలు ఒకేసారి. కానీ చందన తెచ్చింది ఒక రబ్బరుబొమ్మ. చూసావుగా దానిపరిస్థితి ఇలాంటి దానికి పెళ్ళేమిటి ? అంది దేవకి. పెళ్లయితే అదే పోతుంది అంటాడురాఘవ. తనూ వినోద్ శ్రీనగర్ వెళ్లాలని పట్టుబట్టింది చందన. అందర్ని ఒప్పించి తనూ బయల్దేరాడు రాఘవ. బాబును వినోద్ దాచాడని,తన్ను పెండ్లి చేసుకుంటే ఎలాగోలా బాబుని తెస్తానని చందనని పెండ్లికి వప్పిస్తాడు రాఘవ. మురళీతో రాఘవ ఘర్షణ పడుతాడు.

( ఇక చదవండి )



“ నాకు తెలుసు ! ”

“ ఎలా ? .... ”

“ మరి నా బాబుని నువ్వేగా ఎత్తుకుపోయి దాచావ్ ? ”

“ ఛ ! ఛ ! .... నీ బాబుని నే నెత్తికెళ్ళి దాచడం ఏవిటి చందనా ! .... నీ బాబు నీ దగ్గరే వున్నాడుగా.... చూడు ! ఎంచక్క నవ్వుతున్నాడో ! ” బొమ్మని చూస్తూ అన్నాడతను.

అనుమానంగా చూసింది చందన.

“ నిజం ! .... వీడు నీ బాబే ! ” నమ్మకంగా అన్నాడతను.

చందన కళ్ళు తళుక్కుమన్నాయి.

" నిజంగా వీడు నా బాబే కదూ ? .... నా బాబు నెవరు ఎత్తికెళ్ళలేదు కదూ ? " జాలిగా అడిగింది.

" అవును ! వీడు మన బాబే ! "

" మరి....వాళ్ళలా చెప్పారేంటి ? " ఏదో ఆలోచిస్తూ అంది చందన.

" ఎవరు ? "

" ఏం లేదులే ! అన్నట్టు వినోద్ ! మనం మన వూరెళ్ళి పోదామా ? అమ్మా వాళ్ళు ఎదురు చూస్తూంటారు ! " అంది బాబు సాక్స్ సరిచేస్తూ.

" అలాగే ! కానీ మనం వచ్చిన పన్లు పూర్తి కావద్దూ ? "

" అవును ! మనం ఎందుకొచ్చాం ? " అంది చందన.

" మన బాబుకి ఇక్కడి సుందర దృశ్యాలన్నీ చూపించడానికి ! అసలందుకేగా నువ్వు పట్టు పట్టి తీసుకొచ్చింది ! "

" అవునవును !....ఇక్కడంతా చూపించాలి ! పద ! ఇప్పుడే ఈ వూరంతా చూపిద్దాం ! " ఉత్సాహంగా లేచింది చందన.

" ఉహుఁ ! ఇప్పుడు రాదు ! " ఆమెని కూర్చో బెడుతూ అన్నాడు జయంత్.

" మరి ? "

" మీ మావయ్యా వాళ్ళు బైటికెళ్ళాక ! "

" మావయ్యా వాళ్ళు ఎప్పుడెళ్తారు ? "

" ఓ గంట తర్వాత ! ఇప్పుడు వాళ్ళు కింద టిఫిన్ తీసుకుంటున్నారు. వాళ్ళు వెళ్ళగానే మనం వెళ్ళిపోదాం! "

"మావయ్య వుంటే మాత్రం ఏం ? " అమాయకంగా అంది చందన.

" మీ మావయ్యా వుంటే బాబుని తీసికెళ్ళనీడు ! "

" అమ్మో ! అయితే తను వెళ్ళాకే మనం వెళ్దాంలే ! " బొమ్మని గుండెలకి అదుముకుంటూ అంది చందన.

" అదీ ! .... అందుకే ఎవరూ చూడకుండా మనం ముగ్గురం వెళ్ళిపోదాం ! "

" అలాగే ! ...అయినా బాబుని నువ్వే ఎత్తుకుపోయావంటాడేంటి మావయ్య ? " ఏదో ఆలోచిస్తూ అంది.

బైట్నుంచి అంతా వింటున్న రాఘవ-" చంపింది ! " అంటూ నెత్తి బాదుకున్నాడు.

" ప్చ్ ! మరేం ఫరవాలేదు ! .... వాడికి తెలిసినంత మాత్రాన కొంప మునిగిందేం లేదు ! .... అయినా అతగాడిని అనుమానిస్తున్నట్టు, అతను రావడం మనకే మాత్రం ఇష్టం లేనట్టు అతనికి తెలియదు గనకనా ! " తేలిగ్గా అనేశాడు మురళి.

" ష్ ! " అన్నట్టు సైగ చేశాడు రాఘవ. మురళి మౌనంగా వుండిపోయాడు. మళ్ళీ ఇద్దరూ గదిలోని మాటల్ని జాగ్రత్తగా వినసాగారు.

బాబుకి జోలపాట పాడుతోంది చందన కర్ణకఠోరంగా. జయంత్ చెవుల్లో వేళ్ళు పెట్టుకుని నానా అవస్థ పడుతున్నాడు.

" ఏమిటీ నా పాట బాగాలేదా ? " కసురుకుంది చందన.

“ అబ్బే ! బావుండక్కాదు ! .... చెవిలో ఏదో దూరింది ! ” కంగారుగా అన్నాడతను.

“ రెండు చెవుల్లోనూనా ? ”

“ ఊఁ ! ”

“ నీళ్ళు పొయ్యనా ? ”

“ ఒద్దొద్దు ! ” మరింత కంగారు పడ్డాడతను. మళ్ళీ పాట మొదలెట్టింది చందన.

బైట్నించి అంతా గమనిస్తున్న రాఘవ, మురళి, పగలబడి నవ్వుకున్నారు.

“ చందనా ! ” హఠాత్తుగా పిల్చాడు జయంత్.

“ ఏవిటి ? ” పాట ఆపింది చందన.

“ నేనోసారి బైటికెళ్ళొస్తాను . ”

“ ఇప్పుడా ? ఎందుకు ? ”

“ చిన్న పనుంది !....ఓ గంటలో తిరిగొచ్చేస్తాను ! ఈలోగా నువ్వు బాబుని నిద్రపుచ్చు ! ” ఇబ్బందిగా కదుల్తూ అన్నాడు జయంత్.

“ మరి....మనం బాబుని బైటికి తీసికెళ్ళొద్దూ ? ”

“ఎందుకు తీసికెళ్ళడం !....ఇప్పుడే వచ్చేస్తాను !....”

“ సరే ! వెళ్ళు ! ”

మెల్లగా లేచాడు జయంత్.

“ వినోద్ ! ”

వెనక్కి తిరిగాడతను.

“ తొందరగా వచ్చెయ్యి ! ”

“ అలాగే ! ” అంటూ తలుపులు తీసుకుని బైటి కొచ్చాడతను.

అంతవరకు గుమ్మంలో నిల్చున్న మురళి, రాఘవ గభాల్న పక్కకి తప్పుకున్నారు. జయంత్ వెళ్ళిపోయా డనుకున్న తరవాత ఇద్దరూ లోపలి కొచ్చారు.



బొమ్మని కాళ్ళమీద పడుకోబెట్టుకుని జోకొడుతున్న చందన వాళ్ళని చూసి——

“ మళ్ళీ ఏవిటి ? ” అంది విసుగ్గా.

“ ఏం లేదు .... బాబు నిద్రపోతున్నాడా ? ” ఆప్యాయంగా అడిగాడు రాఘవ.

“ అవును ! ఏడ్చి ఏడ్చి ఇప్పుడే కళ్ళు మూశాడు ! ”

" అది సరే .... వినోద్ ఏమంటున్నాడు ? " కుతూహలంగా అడిగాడు.

" ఆఁ ఏముంది ! బాబుకి ఇక్కడి ప్రదేశాలన్నీ చూపిద్దాం అన్నాడు ! "

" అబద్ధం ! " అరిచాడు మురళి.

" ఎవరిది ? "

" అదే....ఆ వినోద్‌ది ! "

" ఏం ? "

" బాబుకి ప్రదేశాలు చూపించడు ! ఈ ప్రదేశాన్నుంచి వాణ్ణి ఎత్తుకుపోతాడు ! " అందుకున్నాడు రాఘవ.

భయంగా చూసింది చందన.

" అవును చందనా ! వాడొట్టి దొంగ ! బాబుని నీ నుంచి దూరం చెయ్యడానికే నీ వెంట పడ్డాడు ! " నమ్మకంగా అన్నాడు మురళి.

" వినోద్ సంగతి నీకు అస్సలు తెలియదు.... వాడు...." రాఘవ మాట పూర్తి కాకుండానే—

" అబ్బబ్బ ! మీరంతా కలిసి నాకు మతి పోగొడు తున్నారు. మీరు దొంగలంటాడు అతను ! అతను దొంగ అంటారు మీరు ! .... అసలు నన్ను ఒంటరిగా కాసేపు వదలండి ! ఎవరు దొంగలో నేనే తేలుస్తాను ! " అరిచింది చందన.

మొహాలు చూసుకున్నారు మగాళ్ళిద్దరూ.

" వెళ్ళండి !....ఓ గంట తర్వాత రండి ! ఈలోగా ఎవరు మంచివాళ్ళో ఆలోచించి నిర్ణయించుకుంటాను ! " కఠినంగా అంది.

నిస్సహాయంగా బైటికి నడిచారిద్దరూ.

గభాల్న తలుపేసి మళ్ళీ కర్ణకఠోరంగా జోలపాట మొదలు పెట్టింది చందన.

* * * * *

గదిలోని ఫేన్ తిరుగుతూనే వున్నా ఎందుకో తెగ వుక్కగా వుంది. మంచంమీద పడుకుని ఆలోచిస్తున్నాడు బాబు.

వాడికంతా భయంగానూ, తమాషాగానూ వుంది. అసలు ఇన్నాళ్ళు తండ్రి నొదిలి వుండనందున ఏడుపు కూడా వస్తోంది.

" ఛీ ! .. వీళ్ళంతా చాలా చెడ్డవాళ్ళు ! " గొణుక్కున్నాడు. మళ్ళీ ఏదో ఆలోచన తట్టి చటుక్కున లేచి కూర్చుని—

" ఏయ్ ! .... ఓసారిలా రా ! " అన్నాడు గట్టిగా. అయితే ఎవరూ వాడి మాట పట్టించుకోలేదు.

" ఎవరక్కడ ?....అర్జంట్‌గా ఓసారిలా రండి ! " అరిచినట్టు మళ్ళీ పిల్చాడు.

గది బైట కునికిపాట్లు పడుతున్న వ్యక్తి తృళ్ళిపడి లేచి తలుపుతీశాడు.

" నిద్రపోతున్నావా ? " పరామర్శించాడు బాబు.

" సరేలే ! ఏం కావాలి ? " విసుగ్గా అన్నాడా వ్యక్తి.

" ఓ మాటడగాలి ! "

" ఏమిటది ? ... "

" నన్నెందుకు ఇక్కడికి తీసుకొచ్చారు ? " పాత ప్రశ్నే మళ్ళీ వేశాడు.

" ఇదడగడానికేనా పిల్చింది ? " కొట్టినట్టన్నాడతను.

" అవును ! లేకపోతే నీ క్షేమ సమాచారాలడగడానికనుకున్నావా ? " కిసుక్కున నవ్వాడు బాబు.

" ఏయ్ ! ఏమన్నావ్ ? "

" అబ్బ ! కోప్పడకు !....తరవాతడుగుతాలే నీ క్షేమ సమాచారాలు ! ముందు నన్నెందుకు తెచ్చారో చెప్పు ! "

" నాకు తెలియదని ఇప్పటికి వందసార్లు చెప్పాను ! " కస్సుమన్నాడతను.

" ష్ ! అరవకు !....చెప్తే ఇంకోసారి చెప్పకూడదనుందా ? .... " బాబు విసుక్కున్నాడు.

" అరుస్తున్నానా....పిల్చి వాగించి.... "

" నేను వాగించానా ? .... ఒకేమాట అడిగాను. దానికి నువ్విన్ని మాటలు మాట్లాడావ్ ! నీకూ చిన్నప్పుడు మీ అమ్మ వసపోసుంటుంది ! నాకూ అంతే ! మా అమ్మ వసపోసిందిట ! అందుకే నేను చాలా మాటలు మాట్లాడతానట ! మా కాంచనక్క అంది ! " అమాయకంగా అన్నాడు బాబు. ఆ వ్యక్తికి పిచ్చ కోపం వచ్చింది.

" కుర్రనాయాలా ! నోరుమూసుకు పడుండు ! " అంటూ ఒక్క అరుపు అరిచి బైటికొచ్చి తిరిగి తలుపు బైట గొళ్ళెం పెట్టేశాడు

బాబుకి ఒళ్ళు మండిపోయింది. కోపంగానూ, మరింత చిరాగ్గానూ వుంది. ఎన్నిసార్లడిగినా ఎవరూ సరిగ్గా చెప్పడంలేదు- వాడి మాటలకి సమాధానం ! వాడి కోపమంతా తనని తెచ్చినవాడి మీదికి తిరిగింది.

" ఛీ ! ఆ మావయ్య వెధవ వుట్టి విలన్ ! నాన్నని చూపిస్తానని చెప్పి ఇక్కడ తెచ్చి పడేశాడు ! అమ్మ ఎదురుగా ఎంచక్కా ముద్దుగా మాట్లాడి ఇక్కడేమో " నోరు మూసుకో ! " అంటూ కసురుకున్నాడు ! ప్చ్ ! .... ఇప్పుడు అమ్మేం చేస్తోందో ! .... పాపం ! నాన్న నా కోసం చాలా బాధపడుతూండి వుంటారు ! ఏడుస్తున్నారేమో కూడా !....అవును మరి ! చెప్పకుండా వచ్చేస్తే ఏడుపు రాదూ ? ....

అయినా ఆ అంకుల్ మళ్ళీ కనిపించలేదేవిఁటి ?.... " అదిగో అమ్మ " అని అమ్మని దూరంనించి చూపించి వెళ్ళిపోయాడు. పిల్చినా పలక్కుండా ! అయినా అమ్మ దగ్గరికి తీసుకొచ్చినవాడు "ఇదిగో ! మీ అబ్బాయి !.... అమ్మ కావాలని ఏడుస్తూంటే తీసుకొచ్చాను ! ...." అని చెప్పాలా ? ఉఁహూఁ ! పిరికిలా పారిపోయాడు.

పోనీ అమ్మ మాత్రం ? .... ఇన్నాళ్టికి కొడుకు కనిపించాడు కదా ! నా కోసం ఏడుస్తున్నాడు కదా ! పాపం ! ఓదారుద్దాం ! .... అనుకోవాలా ? ఉఁహూఁ ! అదీ లేదు ఎప్పుడూ.

" అవతలికిపో ! అవతలికిపో ! " అని ఒకటే విసుగు ! .... ఏవిఁటో ! ఈ పెద్దాళ్ళకి అసలు బుద్ధే వున్నట్టు లేదు !...." నిట్టూర్చాడు బాబు తిరిగి పడుకుని.

వాడికి అంకుల్‌మీదా, మావయ్యమీదా.... ఇంకా.... తనకి సరిగ్గా జవాబు చెప్పని నౌకరుమీదా అందరిమీదా కచ్చగా వుంది.

మెల్లిగా తలుపు తెరుచుకుంది. బాబు కళ్ళు చిట్లించి చూశాడు.

ఇందాక తన ప్రశ్నకి కసురుకున్నతనే వచ్చాడు. అతని చేతిలో అన్నం కూరలు వున్న పెద్ద పళ్ళెం వుంది.

వాటిని చూడగానే బాబుకి ఆకలి గుర్తొచ్చింది. గభాల్న లేచి కూర్చున్నాడు.

కంచం బాబు ముందున్న స్టూల్‌మీద పెట్టి— " తిను ! " అన్నాడతను.

అతని మొహంలో ఇందాకటి విసుగులేదు.

" ఎలాగైనా మీరు కాస్త మంచివాళ్ళే ! " మెచ్చుకున్నాడు బాబు.

" ఏం ? " అన్నాడా వ్యక్తి.

" చూడ్డానికి విలన్‌లా వున్నా ఎంచక్కా నాకు టైమ్‌కి అన్నం, టిఫిన్లు, పాలు అన్నీ ఇస్తున్నారుగా ? " మెచ్చుకున్నాడు బాబు.

ఆ వ్యక్తి చిన్నగా నవ్వాడు.

" తిను ! " అన్నాడు కూజాలోంచి నీళ్ళు గ్లాసులోకి వంచుతూ.

బాబు అన్నం తినసాగాడు. క్షణం తర్వాత— " నీ కెందరు పిల్లలు ? " అన్నాడు పెద్ద ఆరిందాలా.

" ఇద్దరు ! "

" నా అంతే వుంటారా ? "

" ఉఁహూఁ ! ఇంకా చిన్నవాళ్ళు ! "

" అయితే జాగ్రత్త ! వాళ్ళని బైటికి వెళ్ళనీకు ! " రహస్యంగా అన్నాడు బాబు.

" ఏం ? " కుతూహలంగా చూశాడతను.

" నాలాగే ఎవరైనా అమ్మని చూపిస్తానని ఎత్తుకు పోతారు ! .... అన్నట్టు మీ అమ్ముందా ? "

" మా అమ్మా ? "

" అదేలే ! .... మీ పిల్లలకి అమ్మ ! "

" ఉంది ! .... "

" అయితే నాన్నని చూపిస్తానని అబద్ధాలు చెప్పి తీసికెళ్ళిపోతారు ! .... పాపం అప్పుడు నాలాగే వాళ్ళు ఏడుస్తారు !....మానాన్నలాగా నువ్వూ బాధ పడాలి ! " జాలిగా అన్నాడు బాబు.

" మీ నాన్న బాధపడుతున్నాడని నీకెలా తెలుసు ? " మళ్ళీ నవ్వాడా వ్యక్తి.

" సరే ! పిల్లలు చెప్పకుండా వెళ్ళిపోతే బాధ పడరా ? " కసిరాడు బాబు.

అతనేం మాట్లాడలేదు. అలా మౌనంగా నిల్చున్నాడు.

" సరేగానీ....నన్నేం చేస్తారు ? " పెరుగన్నం తింటూ అడిగాడు బాబు.

" తెలియదు ! " అతని మొహం గంభీరంగా అయిపోయింది.

" అవున్లే ! .... నీకేం తెలుస్తుంది ? .... పాపం ! నువ్వు నౌకరు వెధవ్వి కదా ! " జాలిగా అన్నాడు బాబు.

" ఏయ్ ! ఏమిట్రా వాగుడు ? " కోపంగా చెయ్యెత్తాడతను.

" ఏం లేదు ! అన్నింటికీ అలా కోప్పడకు ! " చెయ్యి కడుక్కుంటూ అన్నాడు బాబు.

కొరకొరా చూశాడతను.

అతన్ని చూస్తుంటే బాబుకి మరీ వుడికించాలనిపించింది.

" అది సరే !....నీలాంటి నౌకర్లెందరున్నారిక్కడ ? " అమాయకంగా అన్నట్టు అన్నాడు బాబు. అయితే వాడి మాటల్లోని వ్యంగ్యం గుర్తించి గభాల్న బాబు రెక్క పట్టుకున్నాడతను.

నిజంగా భయపడిపోయాడు బాబు.

" సారీ ! సారీ ! .... " కంగారుగా అన్నాడు.

" అనవసరం అయిన విషయాలు నీకెందుకు ? " కొట్టినట్టే అన్నాడతను.

" ఇదీ తప్పేనా ? .... వూరికే నీకు తోడుగా ఎందరుంటారు అని అడిగానంతే !....ఒద్దంటే ఇంక ఇలాంటి ప్రశ్నలు వచ్చినా వెయ్యను ! "

కాస్త శాంతించాడతను.

ఏదో గొణుక్కుంటూ బాబు తిన్న కంచం తీసుకుని బైటకెళ్ళిపోయాడు.

వెళ్ళేటప్పుడు తలుపులు వెయ్యడం మాత్రం మర్చిపోలేదతను.

బాబు మళ్ళీ ఒంటరిగా మిగిలిపోయాడు ! వాడి చిన్నారి మనసులో ఎన్నో ఆలోచనలు ! ఇందాకటి ధైర్యం పూర్తిగా పోయింది. ఏడుపు కూడా వస్తోంది. నీరసంగా మంచంమీద కూలబడ్డాడు. వాడలా కూర్చున్నాడో లేదో మళ్ళీ తలుపులు తెరుచుకున్నాయి.

కుతూహలంగా చూశాడు బాబు.

మెల్లగా లోపలి కొచ్చాడు రాఘవ. అతని వెనగ్గా మరొక వ్యక్తి కూడా ఉన్నాడు.

రాఘవని చూసి మొహం చిట్లించాడు బాబు. ఆపై అతని వెనగ్గా వున్న వ్యక్తిమీద వాడి కళ్ళు పడ్డాయి.

అంతే ! ఎగిరి గంతేశాడు.

వాడి మొహం వెలిగిపోయింది.

ఎక్కడలేని ఉత్సాహం కట్టలు తెంచుకుంది.

" అంకుల్ ! " అంటూ ఒక్క అంగలో రాఘవని తోసుకుంటూ వెళ్ళి అతని కాళ్ళకి చుట్టేశాడు.

( స శే షం )

శు భా కాం క్ష ల తో

# ది మచిలీపట్నం కో - ఆపరేటివ్ అర్బన్ బ్యాంకు లిమిటెడ్. నెం. 4783

స్థాపితం. 4-3-1920

మచిలీపట్నం: బ్రాంచి: ఐచ్చుపేట

* రు 7000ల వడ్డీ వరకు ఆదాయపుపన్ను మినహాయింపు కలదు.
* డిపాజిట్టుకు ఇన్సూరెన్సు కార్పొరేషన్ వారి రక్షణ కలదు.
* ఫిక్సుడు డిపాజిట్లు 15 రో. నుండి 5 సం. వరకు; 4% నుండి 12% వరకు.
* అన్నిరకముల డిపాజిట్లు కలవు. బంగారు నగలపై ఋణ సౌకర్యం కలదు.

| అధ్యక్షులు | కార్యదర్శి |
|---|---|
| శ్రీ టి. యల్. పెరుమాళ్లు | శ్రీ డి. పురుషోత్తం |
| ఫోన్. నెం. 2176 | ఫోన్. నెం. 414 |

డైరక్టర్లు: శ్రీ బి. యస్. జీలేశ్వరరావు, శ్రీ జి. కృష్ణారావు, శ్రీ ఎమ్. నాగేశ్వరరావు, శ్రీ మీర్జా కాల్బెహుస్సేన్ శ్రీ కె. యన్. నాంచారరావు, శ్రీ యన్. నరసింహారావు, శ్రీ కె. రామచంద్రరావు

అ భి నం ద న ల తో

పిప్పరమెంట్, లవంగనూనెల అపూర్వ సమ్మేళనం!

**జెమిని**

**పళ్లపొడి**




జెమిని
కెమికల్ ప్రొడక్ట్సు
మచిలీపట్నం-1 A.P

అన్ని ఋతువులందు నమ్మదగినవి!

**జెమిని**

**అగ్గిపెట్టెలు**




మార్కెట్ చేయువారు
జెమిని
ఎంటర్‌ప్రైజెస్
కందులవారి వీధి
విజయవాడ 520001